# ప్రపంచ కథలు

( మొదటి భాగము )

పోలండ్ స్వీడన్ రష్యా చైనా ఫ్రాన్సు
ఐర్లండ్ ఇటలీ ఆస్ట్రియా జెకొస్లొవేకియా

జాకొబిన్ పబ్లిషర్సు, తెనాలి.

# ప్రపంచకథలు

('ఆడవాళ్ళు నేనంటే పడిచస్తారు'....యింకా యితర కథలు)

అనువాదకులు :

కె. రాధాకృష్ణమూర్తి
పి. వి. సుబ్బారావు

జాకొబిన్ పబ్లిషర్స్, తెనాలి.

# విషయసూచిక

# అభిప్రాయాలు

వివిధ దేశాల్లోని ప్రముఖ రచయితల కథాశిల్పాన్ని, ఆ యా దేశాల సాంఘిక, మానసిక పరిస్థితుల్లోని విలక్షణాలను తెలుసుకోవాలంటే యీ రెండు భాగాలను చదివితీరాలి.

వర్ధమానకథకులకు ఈ సంపుటాలు పాఠ్యగ్రంథాలు కాగలవని నా విశ్వాసం.

జి. వి. కృష్ణరావు, బి. ఏ.

ప్రపంచ పరిస్థితుల్ని అవగాహన చేసుకొని, ప్రజానీకం అన్ని విధాలా పైకిరావాలంటే, ఇలాంటి కథలే కావాలి....కథలంటే ఆసక్తిలేని వాళ్ళనికూడా ఈ కథలు తమవైపుకు ఆకర్షించుకో గలుగుతున్నాయి.

కావ్యతీర్థ, కవితావతంస
ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

ఎంతోకాలంనించీ నేను కావాలనుకున్న కథల్ని యీ అనువాదకులు ప్రసాదించారు. ఇట్లాంటి కథాసంపుటాలు ఎక్కువగా వచ్చిననాడే మన కథాసాంప్రదాయం, సంస్కారం అన్నిట్లోనూ అభివృద్ధికరమైన విప్లవం వస్తుంది.

. వి. విమలాకుమారి

మానవ మనోప్రవృత్తుల్లోని విచిత్ర గతులు, అద్భుతాలు యీ కథల్లో ప్రతిభావంతంగా చిత్రింపబడ్డయి. కథారచనలోగాని, శిల్పంలోగాని కళాయుతంగా చిత్రించే ఉపజ్ఞగల విశ్వవిఖ్యాతసాహితీపరుల కథ లివి. మాతృకలకు మెరుగుబూసి అనువదించే సామర్థ్యంగల యీ అనువాదకులకు నా అభివందనాలు.

పి. సత్యవతీదేవి, బి. ఏ.

# గుణపాఠం.

చాలా వెనకటి సంగతి. 11 వ లూయీ ప్రభుత్వం చేస్తున్న రోజుల్లో పారిస్‌లో ఒక యువతి నివసిస్తూ వుండేది. ఆమె పేరు సైలాంటీ. సుగుణాల్లో ఆమెకు పెట్టింది పేరు. ఆ కాలంలో ఫ్రాన్సు దేశంలో ఆమెలాంటి నిర్మల హృదయం, మంచి ప్రవర్తన గల మరొక యువతి లేదంటే అతిశయోక్తి కాదు. తరచుగా ఆమె యింటికి వస్తూ వుండే లాయరు గారొకరు, డాక్టరు జేమ్స్ ఆమెను కలుసుకున్నప్పుడల్లా యిలా అంటూ వుండేవారు.

"మాడమ్! నాకు తెలిసినంతవరకూ నీలాంటి సుగుణవతి, నిర్మలహృదయంగల యువతిని నేను ఎక్కడా చూడలేదు. వినలేదు కూడాను. నీవు లుటీషియా పేరు కూడా మరిపిస్తున్నావు."

దీనికి ప్రత్యుత్తరంగా సైలాంటి యిలా చెప్తూ వుండేది.

"నా హృదయం యొక్క పవిత్రత నాకు తెలిసివుంటే నాకు చాలు. ఇంతకంటే నేను కోరేది కూడా లేదు. కేవలం పైవాళ్ళల్లో ప్రఖ్యాతి ఆర్జించటం యెందుకూ? కాగా తక్కిన వాళ్ళకంటె నేను యేదో సాధించేస్తానని విరగపడటంకూడా నాకు చేతకాదు."

ఆమెకు మామూలుగా యుక్తవయస్సు రాగానే పార్లమెంటులో ప్రభుత్వ లాయరుగా పనిచేస్తున్న ఒక ఫ్రెంచి దేశస్థుడితోనే పెళ్ళి జరిగింది కాని, అతనికీ, ఆమెకూ మనస్తత్వంలో చాలా భేదముంది. అతనిది అందరికీ నచ్చే స్వభావం కాదు. గట్టి హృదయం కలవాడు. ముద్దాయికి శిక్ష వేయించటమే అతని పద్ధతి. ముద్దాయిగా వచ్చినవాడు నేరం చేశాడా లేదా అనే విచక్షణ అతనికి లేదు. ఇది యిలావుంటే యింటికి వచ్చినప్పుడైనా భార్యని సంతోష పెట్టుదామని గాని, భార్యతో కులాసాగా కాలం గడుపుదామని గానీ అతనికి యేకోశానా వున్నట్టు లేదు. పగలంతా కోర్టులోనూ, రాత్రిళ్లు తన ఆఫీసు రూములో కూర్చుని మరునాటి ఫయిలు తిరగవేయటం అతని నిత్యకృత్యంగా వుండేది.

భర్త తనని దగ్గరకు చేరనియ్యకపోయినా సైలాంటి మనస్సు కష్టపెట్టుకునేది కాదు. అతను తనతో మాట్లాడటం లేదని, తనని ప్రేమించటం లేదని విచారించేది కూడా కాదు. పైగా అతనంటే గొప్ప ప్రేమతోనూ, వినయ విధేయతలతోనూ మెలుగుతూవుండేది. అతడే తన సర్వస్వం అని భావిస్తూ

వుంటేది కూడాను. డాక్టరు జేమ్స్ ఆమె యీ సత్ప్రవర్తన చూచి ఆమెను మరీ పొగడుతూ వుండేవాడు. ఆమె జీవితం అంతా యిలాగే గడుపుతుందని, ఆమె మనస్సులో చలించే స్వభావం లేదని కూడా అంటూ వుండేవాడు. ఉదాహరణకు తానేఒకటి రెండు సార్లు ఆ సత్ప్రవర్తన నుంచి ఆమెను తొలిగించటానికి ప్రయత్నించికూడా విఫలుడైనట్లు ఒప్పుకున్నాడు.

మామూలుగా తక్కిన యువతుల్లాగానే ఆమెకూడా రిబ్బన్లు పెట్టుకుంటూ వుండేది. లేసుతో కుట్టిన గౌన్లు, సిల్కు గౌన్లు, యింకా రకరకాల గౌన్లు ధరిస్తూవుండేది. చర్చికి వెళ్ళేటప్పుడు కూడా ఆమె యీ దుస్తులతోనే వెళ్ళుతూవుండేది. చర్చికూడా యీడ్రెస్‌లో వెళుతున్నా తక్కిన ప్రజలు ఆమెను చూచి అనుమానించేవాళ్లు కాదు. "మతం అంటే మూఢనమ్మకం వున్నవాళ్లు, మత సాంప్రదాయాలు తూ, చా తప్పకుండా ఆచరించే ప్రీస్టులు ఆమె డ్రస్ చూచి అనుమానిస్తే అది వాళ్ళ తప్పుగానీ నిజంగా ఆమె హృదయం మంచిదే" నని అనుకుంటూ వుండేవాళ్లు, వాళ్ళు.

కాని మతబోధకుడు బ్రదర్ జీన్‌కి యిది నచ్చలేదు.

"మాడమ్! నీ అంతట నీవే ఆలోచించుకో. సెయింట్ కాథరీన్ నీలాగా రిబ్బన్ల కోసం, లేస్ కొరకు జనీవా పంపితే, స్వర్గాని కెళ్ళేదేనా?" అని ఆమె కనపడ్డప్పుడల్లా బోధిస్తూవుండేవాడు.

బ్రదర్ జీన్‌కి మతంమీద వున్న మూఢ విశ్వాసం మరెవ్వరికి లేదు. మానవుల్లో యేమాత్రం మతప్రకారం లేకపోయినా అతడుసహించలేడు. కాబట్టి అతనికి మైలాంటి ధరించే రిబ్బన్లు, లేసు, సిల్కు గౌన్లలో 'పాపం' కనపడింది. ఆమె ప్రవర్తన మార్చుకోకపోతే ఆమెకు నరకం తప్పదనికూడా బ్రదర్ జీన్ ఆమెను అనేకసార్లు బెదరించాడు.

ఆమెను బెదరించటానికి మరొక కారణంకూడావుంది. ఆమెభర్తకు వయసు మళ్ళింది. బట్టతల. పైగా తలమీద ఆ సేహేట్ కూడా పెట్టుకునేవాడు కాదు. చూట్టానికి ముసలాడుగా కనపడుతుండేవాడు. ముసలి మొగుడికి పడుచు పెళ్ళాంగా వున్న మైలాంటి నాజూగ్గా వుంటం బ్రదర్ జీన్ సహించలేకపోయాడు.

... ... ... ... ...

ఫిలిపుకూడా తమాషాగా ఆమెను అప్పుడప్పుడు యెగతాళి పట్టిస్తూవుండేవాడు.

"చూడు! నీభర్తకప్పుడే బట్టతల అయింది. కొద్దిలోనే అవసాన కాలం సమీపించేటట్టుంది."

ఫిలిపు ఆకాలంలో మంచి యోధుడు. పైగా కంటికి కానగల యువకుడు కూడాను. ఒకనాడు అకస్మాత్తుగా ఫిలిపుకి వైలాంటికి పరిచయం యేర్పడ్డది. ఆనాటి రాత్రి వాళ్ళిద్దరు కలసి థియేటరుకు వెళ్ళి డ్యాన్సు కూడా చేసారు. అప్పటినుంచి వాళ్ళిద్దరూ ఒకరి నొకరు కలుసుకోటం మామూలైంది. వైలాంటి స్నేహం ఫిలిపుకు ప్రేమగా మారింది. అతడు యెప్పుడైనా యీవిషయం ఆమె ముందే వెల్లడిస్తూవుండేవాడు. ఒక్కోసారి "నీ నగ్న శరీరాన్ని నా రెండు చేతుల్తో బంధించనియ్యి" అని కూడా అంటూవుండేవాడు.

ఇందుకు "ఫిలిపు! నీవు యేం అంటున్నావో, యెవరి నంటున్నావో ఆలోచించటం లేదు. నేను అలాంటి దానను కాను" అని ఆమె జవాబు చెప్పతూవుండేది.

అతడు మరీబలవంతం చేస్తే 'రేపురా' అని సమాధానం చెప్పి పంపేది.

మర్నాడు వస్తే "యేచ్చే ! అప్పుడే యింతతొందరా?" అని మళ్ళీవెనక్కు పంపేది.

ఇలాంటి 'రేపు'లు యెన్నో జరిగిపోయినై. కాని ఫిలిప్పుకి ఆమె మాటల్లో నమ్మకం పోలేదు. ఆమె యెప్పటికైనా అంగీకరిస్తుం దనే విశ్వాసంలోనే వున్నాడు.

పరిస్థితు లిలావుండగా బ్రదర్ జీన్‌కి వెనిస్ రావాలని, అక్కడ కొత్తగా మతంలో చేర్చిన వాళ్ళకు మతం బోధించాలని పిలుపు వచ్చింది. అతను వెనిస్ వెళ్ళేముందు మళ్ళీ వైలాంటిని కలుసుకొని ప్రవర్తన మార్చుకోవాలనీ వెనుక చేసిన పనులకు ప్రాయశ్చిత్తం చేసుకొమ్మనీ బోధించాడు.

వైలాంటి సమ్మతించినట్లుగా "మీరు యిక అంతగా చెప్పనక్కరలే"దని సమాధానము చెప్పింది.

బ్రదర్ జీన్ అంతటితో తృప్తిచెందలేదు. ఆమె జీవితం మంచి మార్గంలో నడిపితే వెన్నిస్‌నుంచి వచ్చేటప్పుడు ఆమె కోరుతున్న వస్తువు తెచ్చి పెట్టుతానని ఆశ పెట్టాడు. ఆమె యేదైనా దేవుడిపూజకు పనికొచ్చేవస్తువు తెచ్చిపెట్టమంటుందని అతడనుకున్నాడు. కాని ఆమె మరో వస్తువు కోరింది.

"బ్రదర్ జీన్ ! వెన్నిస్ పట్టణములో మంచిమంచి అద్దాలు, వున్న ముఖం వున్నట్లు కనబడేవి అమ్ముతారని ప్రతీతి. మీరు తిరిగివచ్చేటప్పుడు నాకొకటి మంచి అద్దం తెచ్చి పెట్టండి."

బ్రదర్ జీన్ 'సరేనని' వాగ్దానం చేసి వెళ్ళాడు. అతడు వెళ్ళినాక కూడా వైలాంటి తన మామూలు జీవితం గడపసాగింది. ఈ మధ్య ఒకటి రెండుసార్లు ఫిలిపు "ఇలా యెంత కాలం విడిగా వుంటాము. కలిసి సుఖాన్ననుభవిద్దాం"

అని బలవంతంచేసాడు. కాని ఆమె "ఒంట్లో బాగాలేదు. 'ఇవ్వాళ యింట్లో వుండను—" అని యేవో అడ్డంకులు చెప్పతూ గడిపింది. అజ్ఞానులు మట్టుకు ఆమె భర్తతో యెప్పుడూ కలిసినట్లు లేని ఇంతకంటే మరో పాపం వుందా అని అనుకుంటూ వుండేవాళ్ళు.

బ్రదర్ జీన్ వెన్నిస్‌నుంచి తిరిగి వచ్చాడు. రాగానే వైలాంటి యింటికి వచ్చి "ఇదుగో! నీవుకోరుకున్న అద్దం తెచ్చా," నని సంచిలోనుంచి ఒక చచ్చిపోయిన ఆడమనిషి తలకాయ బయటికితీసి "మాడమ్! ఇదుగో నీవుకోరినఅద్దం. వెన్నిస్‌లోవున్న అందరికంటె చాలా అందంగానూ, నాజూగ్గాను వున్న స్త్రీ తలకాయ యిది. ఈమె ఒకప్పుడు నీలాగానే వుంది. నీవు కొద్దిరోజుల్లో యీమె మాదిరి అయిపోతావు" అని ఆతలకాయను వైలాంటి కందిచ్చాడు.

శవం తలకాయ చూడగానే వైలాంటికి భయం వేసింది. కాని బ్రదర్ జీన్ దాన్నెందుకు తెచ్చాడో, తనకెందుకు బహుమతి యిస్తున్నాడో తెలుసు కొని లోపలి భయాన్ని లోపలే అణచివేసి "బ్రదర్ జీన్! మీరు నాకు మంచి గుణపాఠం నేర్పారు. నా జన్మలో యిది మరచిపోను." అని చేయి చాచింది ఇంకా ఆమె 'బ్రదర్ జీన్! మీరు తెచ్చిన అద్దం చాల విలువ కలది. దీన్లో యిప్పటి నాముఖము చూడలేక పోయినా కొద్దికాలం తరువాత యెలావుంటుందో చూడగలుగుతున్నాను. ఇంకనుంచి మీరు చెప్పినట్లు తప్పకుండా నా ప్రవర్తన నా ఆజ్ఞలో వుంచుకుంటానని శపథముచేస్తున్నా" నని పెద్దగా చెప్పింది.

వైలాంటిలో అంత మార్పు వస్తుందని బ్రదర్ జీన్ అనుకోలేదు. ఆమె మాటలవల్ల ఆతనికి కొంత మనశ్శాంతి కలిగింది.

"మాడమ్! యీ శవం తలకాయవల్ల నీలోవచ్చిన మార్పుకు పరమ సంతోషం. నీవు దేవుని పేరుతో కూడా శపథము చేయుటము మంచిది."

"గట్టిగా చేయాలా!" అని ఆమె అడిగింది.

'తప్పకుండా'

'సరే! జీవితం వృథాచేయనని' ఆమె దేవుని పేరుతో ప్రమాణంచేసింది.

'నీవు అన్నమాట తప్పవుగా?'

'తప్పను.'

వైలాంటి మాటలకు బ్రదర్ జీన్ సంతృప్తి చెందాడు. తిరిగి వెళ్లుతూ అతడు పెద్దగా "దేవుడి దయవల్ల ఒక స్త్రీ జీవితాన్ని నరకకూపము నుంచి తప్పించి స్వర్గలోకానికి మళ్లించాను...యిక ఆమె పూర్తిగా మారిపోయి నట్లే" అని అనుకుంటూ బజార్లో నడుస్తున్నాడు.

బ్రదర్ జీన్ హైలాంటి యింట్లోనుంచి బయటికి రాగానే ఫిలిపువచ్చి తలుపు కొట్టాడు. హైలాంటి అతడిని లోపలికి ఆహ్వానించి సరాసరి పడకగదికి దారి తీసింది. ఆదివరకెప్పుడూ హైలాంటి ఫిలిపుని ఆగదిలోనికి రానియ్యలేదు. పడక గదిలో అడుగు పెట్టగానే ఫిలిపు హైలాంటిమనస్సు తెలుసుకున్నాడు. తోలు సంచిలోనుంచి యెప్పటినుంచో హైలాంటికోసం దాచి పెట్టిన చాక్లెట్ పొట్లము తీసి ఆమె కిచ్చాడు.

"మాడమ్! యివి పంచదార బిళ్లలైనా నీ పెదవులంత తీపిగా వుండవు."

ఆమె నిజమేనన్నట్లుగా ముఖంలో అంగీకారం చూపింది.

అతడు ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె వెనుకటి ధోరణిలో 'నన్నేమనుకున్నావు' అని సణిగింది.

'నీలాంటి రత్నం యెవ్వరూ అనుభవించకుండా దాచి పెట్టటము మంచిది కాదు. అలా దాచిపెట్టితే యెవడో ఒకడు కాజేయటానికి ప్రయత్నిస్తూనే వుంటాడు." "అట్లయితే నీవే ప్రయత్నించు"అని ఆమె తనమెత్తని చేతులతో అతని తలనిమిరింది.

అతడు క్షణములో ఆమె మీద సర్వాధికారము వహించాడు. ఆమె శరీరాన్ని తన బాహువుల్లో బంధించి వేశాడు. యేమీ తెలియని స్థితిలోబడి తన యిష్టము వచ్చినట్లు ఆమె శరీరము నలిపివేస్తున్నాడు, అనుభవిస్తున్నాడు. అప్పుడప్పుడూ ఆమె బాధపడుతున్నట్లు "ఫిలిపు! నేను భరించలేను ... నీవు యిలా చేయటము బాగోలేదు...ఛీ! యిలాఐతే యెట్లా...వెధవ ప్రేమ... వెధవ జీవితము...చంపుకుతింటున్నావు" అని చిన్నగా అరవసాగింది.

కాని ఆమె యింత బాధలోవున్నా ఆమె కూడా యేదో సౌఖ్యము అనుభవిస్తున్నట్లు కనపడింది. మధురంగా ఫిలిపుతో యిలా చెప్పింది.

"ఫిలిపు! నీవు బలవంతముగానో, లేక మోసంచేసో నన్ను లోబరచుకున్నా ననుకుంటున్నావా? కాదు. నాయిష్టప్రకారము నేనే నీకు లొంగిపోయాను. నిన్ను నేను వెనుకటినుంచీ ప్రేమిస్తూనే వున్నాను. కాని యింతవరకు అంగీకరించకపోవటానికి కారణము పరిస్థితులు సరిగ్గా అర్థముచేసుకోలేక పోవటమే. కాలచక్రము యింతత్వరగా తిరుగుతుందని, జీవితము, ప్రేమ యిందులో ఒక లెక్కకు రావని నేననుకో లేదు. అందుకనే నేను యింతవరకు మందమతినై జీవితసౌఖ్యాన్ని అనుభవించ లేకపోయాను. ఇప్పుడే నీముందు బ్రదర్ జీన్ వచ్చి ఒక మంచి గుణపాఠం నేర్పిపోయాడు. ఇంతవరకూ అతడు జీవితము అమూల్యము అని చెప్పుతూ వుంటేవాడు. కాని జీవితకాలాన్నిగూర్చి చెప్ప

లేదు. ఇప్పుడు ఒక చచ్చిపోయిన స్త్రీ తలకాయ చూపించి కొద్దిరోజుల్లో నేనుకూడా అలాగే అవుతానని బోధించాడు. యీ తలకాయవల్ల నేను నేర్చుకున్న గుణపాఠం, 'యీ అనంత కాలములో జీవితకాలము ఒక రెప్ప పాటు కూడా లేదు. బ్రతికివుంటేనే సౌఖ్యము అనుభవిస్తాము. కాబట్టి వీలైనంతవు ఎంతయెక్కువగా, త్వరగా సౌఖ్యాన్ని అనుభవించటానికి వీలుంటుందో అంత యెక్కువగా త్వరగా అనుభవించటము మంచిదనీ, యీ జీవితము తరువాత సౌఖ్యాన్ని అనుభవించ లేమనీ.' కాబట్టి ఫిలిపు! మనం వీలున్నంతవరకు సౌఖ్యాన్ని అనుభవిద్దాం."

ఫిలిపుని యీ మాటలు మరీ వుద్రేక పరిచినై. ఇద్దరూ వెనక వృథాచేసిన జీవితకాలములోని సుఖంకూడా అప్పుడే అనుభవించటానికి వూనుకున్నారు... అనుభవించినట్లుకూడా వారు భావించారు.

అంతా పూర్తయ్యిన తరువాత ఫిలిపుని పంపుతూ షైలాంటి యిలాఅంది.

"బ్రదర్ జీన్ నేర్పిన గుణపాఠం మనము తూ, చా తప్పకుండా ఆచరించటము చాలా మంచిది."

# బడుద్ధాయి

నా వాఙ్మూలం కూడా వినాలని నా ప్రార్థన.

మీరు మరణదండన వేసినందుకు నేను విచారించను. కనీసం మీదయా దాక్షిణ్యాల కోసంకూడా నేను ప్రార్థించటము లేదు. నా కేసు తిరిగి విచారించమని కానీ నాశిక్ష రద్దుచేయమని కానీ నేను కోరటంలేదు. నా వాఙ్మూలం భావిమానసిక శాస్త్రజ్ఞులకు కొంత సహాయభూతం కావచ్చునని నా ఆశ.

నేను వాఙ్మూలం యిచ్చేముందు నాతరఫున వాదించిన ప్లీడరుకు ధన్యవాదాలర్పిస్తున్నాను. నాకు మరణశిక్ష విధించబడ్డా అతడు నాతరఫున వుండి యెంతో తెలివితేటల్తో హేతువాదంతో వాదించినందుకు ఆయనకు నమస్కారాలు.

ఇక వినండి..................

నాతండ్రి ఒక చిన్న టవున్ లో కస్టమ్సు ఆఫీసరుగా వుండేవాడు. నా తల్లి తండ్రులకు నేను చివరి సంతానము. మొట్ట మొదటి ముగ్గురూ ఆడపిల్లలు కావటంచేత నా తండ్రికి సుఖం అనేది లేకపోయింది. మగ సంతానం కోసం పరితపించాడు. నాలుగోసంతానం మగసంతానం. ఇది చూడగానే యెక్కడలేని సుఖాన్ని పొందానని అనుకున్నాడు. కాని కుర్రవాడు యెప్పటికీ యెక్కు

రాక పోవటం చేత యెప్పుడూ అనారోగ్యంగా వుంటం చేత నా తండ్రికి అను కున్నంత సుఖం లభించలేదు. చివరి సంతానం నేను కావటంచేత దృష్టి అంతా నామీద వుంచాడు.

చిన్నప్పటి నుంచీ నేను చాల అల్లారుముద్దుగా పెరిగాను. నాకోసం మా తండ్రి ప్రత్యేకంగా వొకదాదినికూడా వుంచాడు. క్రొత్త క్రొత్త రకాల ఆట వస్తువులు, బొమ్మలు, మంచి మంచి గుడ్డలు పట్టణంనుంచి నాకోసం తెప్పించేవాడు. ఆగుడ్డలు వేసి దాది నన్ను బయటికి తీసికొని వెళ్ళుతుంటే వూళ్ళో వాళ్ళంతా నామీద కన్నుపెట్టి చూచేవాళ్ళు.

మాతండ్రి నేను యేది కోరితేఅది తెచ్చి యివ్వటం పరిపాటైపోయింది. యిలా ముద్దుగా పెరగటం చేత నాకుయింట్లోనూ, తలిదండ్రులంటేనూ నిర్లక్ష్య భావ మేర్పడింది. లేనిపోని దానికల్లా మారాం చేయుటం, కాదంటే అల గటం తలిదండ్రుల చేత సాగదీయించుకోటం, చివరకు పంతను నెగ్గించుకో టము నాకుమామూలై పోయింది. యిలా సాగించుకోటముచేత నాలో మంకు, గడుసుతనము యేర్పడ్డయ్. ఇవే నా భావి జీవితము యొక్క అధఃపతనానికి మొదటి బీజాలు.

నాకు యెనిమిదో యేడు రాగానే నన్ను బడికి పంపించారు. కాని బడి జీవితము నాకు నచ్చలేదు. బడి అంటే నాకు జైలులాగా వుండేది. సరిగా వెళ్ళేవాణ్ణికాదు. ఇది యిలావుంచి యింటిదగ్గర అలవాటు ప్రకారము పంతు ళ్ళని కూడా లెక్క పెట్టేవాణ్ణికాదు. మాతండ్రి ఆఫీసరు కావటము చేత, ఆయనికి వూళ్ళో వున్న గౌరవంచేత పంతుళ్ళు నన్నేమన లేక యిష్టమువచ్చి నట్లు తిరగనిచ్చే వాళ్ళు.

కాని ఆటలంటే నాకు మహాసరదా. పక్కపిల్లల్ని దమ్మెత్తనిచ్చేవాణ్ణి కాదు. బడికి సరిగా వెళ్ళక పోయినా ఆటల్లో వున్న తెలివి తేటలుచూచి పంతుళ్లు నన్ను మెచ్చుకునేవారు. దానివల్ల నాకు గర్వము మరీ బలిసి పోయింది. కనపడ్డ కుర్రాడినల్లా కదలించి కయ్యము పెట్టుకునేవాణ్ణి.

నాకు పదమూడో యేడు రాగానే హైస్కూలుకిపంపిచారు. ఆ జీవితము నాకు అసలే సరిపడ లేదు. పాఠాల టైమ్‌లోకూడా నేను క్లాసుకి వెళ్ళకుండ బయట వరండాల్లో తిరుగుతుండేవాణ్ణి. పరిస్థితు లీలావుండగానే మా నాయన గారిని ప్రేగ్ పట్టణము బదిలీ చెయ్యటము జరిగింది. ఆయనతో పాటు మా కుటుంబము కూడా కదిలింది. అది నా దురదృష్టానికి మొదటిరోజు. అప్పటి నుంచీ నా జీవితము క్రమేపి అధఃపతనానికి నడిచింది.

మేము అదివరకున్న వూరికీ, తరువాత మేము చేరిన యీ పట్టణానికి చాలా

వ్యత్యాసము కనపడ్డది. ఆ ఊళ్ళో మా తండ్రి మంచి హోదాలో వుండేవాడు. వూళ్ళోవాళ్లు మమ్మల్ని షావుకార్లగా చూచేవాళ్లు. మేమంటే బాగా గౌరవించేవాళ్లుకూడాను. ఇక్కడ అలాకాను. మాకంటె యెంతోమంది బాగా వున్నవాళ్లు కనపడ్డారు. వాళ్లముందు మేము ఒక లెక్కలోని వాళ్ళంగా లేము. మా నాయనకి అక్కడున్న గౌరవం, పేరూ, ప్రతిష్టలు యిక్కడ రాణించలేదు. వూరూ, పేరూలేని ఒక చిన్న గుమాస్తాగా జీవితము గడపవలసి వచ్చింది. ఇచ్చట బాగా జీవితము గడిపేవాళ్ల డ్రస్—ముఖ్యముగా యువతులు ధరించే దుస్తులు చూస్తే మంచి డ్రస్ వేస్తాననుకునే నాకే నా దుస్తులు అసహ్యమునిపించాయి.

ఇంతేకాదు, స్కూలు జీవితముకూడా నాకు నరకములాగ కనిపించింది. మావూళ్ళో వున్నంత దర్జాగా నేను యిక్కడి విద్యార్థులకు కనబడలేను. అందరూ నాకంటె మంచి డ్రస్‌తోనే స్కూలుకు వచ్చేవాళ్లు. నా వంక ఒకడూ చూచేవాడు కాడు. కాగా అక్కడలాగా యిక్కడ కూడా స్కూలు యెగ్గొట్టి తిరిగే సదుపాయము కనపడలేదు. అయినా అప్పుడప్పుడూ బడి యెగ్గొట్టుతూనే వుండేవాణ్ణి. దీనివల్ల మాస్టరు నేనంటే అసహ్యించుకునే వాళ్లు. ఇది యిలావుంచి పొరుగూరునుంచి వచ్చే స్టూడెంట్సు సరిగ్గా శిక్షణ పొంది రారని వారికొక నమ్మకము వుంది. యీ నమ్మకమువల్ల మాస్టర్లంతా పల్లెటూరి విద్యార్థులకంటె పట్టణ విద్యార్థుల్ని యెక్కువగా ప్రేమిస్తూవుండే వాళ్లు. యీ తత్వం నాకు నచ్చలేదు. ఒకటి రెండుసార్లు నేను మా మాస్టరు దగ్గర యీ విషయము హెచ్చరించాను కూడా. కాని ఆయన నాముఖానే పట్టుకొని 'చదువుకోవాలనుకునేవాడికి యీ గొడవ యెందు'కని అడిగాడు.

అప్పటినుంచీ స్కూలు జీవితము నాకు బొత్తిగా సరిపడలేదు. ఒంటరిగా కూర్చునే వాణ్ణి. యేదో ఆలోచిస్తూ వుండేవాణ్ణి. పిచ్చివాడిలాగా వాగుతూ, నాలో నేనే యేడుస్తూ, దిగమ్రింగుకుంటూ వుండేవాణ్ణి. నాలాగా అవస్థ పడేవాళ్లు యెవరా అని వెతికి పట్టుకొని వాళ్ళతో కాలక్షేపము చేస్తూ వుండే వాణ్ణి.

రిజల్టు ప్రకటించారు. ఒకటికాదు, రెండుకాదు, ఐదుసబ్జక్ట్సులో తప్పాను. దీనితో నా జీవితము మరీ తలక్రిందులైంది. మా నాయనకు నేనంటే విరక్తి పుట్టింది. అదివరకు నేనంటే వున్న మమకారం పోయి అసహ్యించుకోటము ప్రారంభించాడు. ఇంతేగాదు, అదివరకు మా అన్నయ్య పాడంటె గిట్టేది కాదు. మావూళ్ళో చదువుకునే రోజుల్లో కూడా మా అన్నయ్య నాకంటే తెలివిగా వుండేవాడు కాదు. కాని యెప్పుడూ రుబ్బటముచేత పరీక్షలు

ప్యాస్ అవుతూ వచ్చాడు. ఇక్కడ కూడా అదే చేయటముచేత వాడు ప్యాస్ అయ్యాడు. నేను తప్పటము, వాడు ప్యాస్ కావటము చూచి మా నాయన మా అన్నయ్యని యెక్కువగా ఆదరించటము ప్రారంభించాడు. పరీక్ష ప్యాస్ అయినందుకు వాడికి వొక కొత్త సైకిల్ కూడా కొనిపెట్టాడు. ఇదంతా జరిగినందుకు నాకు మా అన్నయ్య మీద ద్వేషము పుట్టింది. వాడి పేరు వింటేనే నాకు వొళ్ళు మండుతూ వుండేది. వాడొక్కడే కాదు. మా మాష్టర్లనీ, ప్యాస్ అయిన తక్కిన విద్యార్థుల్ని కూడా యిలాగే చూస్తూవుండేవాణ్ణి.

స్కూలుకి వెళ్ళటము సరిపించాను. ఇంట్లో కూర్చోటానికి అసలే మనస్కరించలేదు. దూరపు బంధు వొకడు యిక్కడ మిలిటరీ సర్వీసులో ఉద్యోగము చేస్తున్నట్లు తెలుసుకున్నాను. రోజూ ఆతని దగ్గరకు వెళ్ళటము అలవాటు పడ్డాను. ఆతడంటే నాకు మంచి యిష్టం యేర్పడింది. ఆతనితోపాటు నేను కూడా సిగరెట్లు, చుట్టలు కాల్చటము నేర్చుకున్నాను. అప్పుడప్పుడు సారాయి బ్రాంది కూడా త్రాగుతూ వుండేవాణ్ణి. లోకాభి రామాయణములో మేము ప్రొద్దు పుచ్చుతూవుండేవాళ్ళము.

అది ఫలానా రోజని చెప్పలేను. కాని నా జీవితములో అదే మొదటి పర్యాయం ఆడవాళ్ళ కబుర్లు చెప్పకోటము. నా మిత్రుడు వాళ్ళని గురించి చాలా సంగతులు చెప్పాడు. ఆ విషయాలు వింటున్నప్పుడు ఇంకా వినాలని బుద్ధి పుట్టింది. వాళ్ల విషయాలు లోతుగా తెలుసుకోవాలని కుతూహలము యేర్పడింది. మా చుట్టాన్ని నేను రోజూ తరిచి తరిచి ఆ విషయాలే అడగటం ఆతడు అవే చెప్పటము మామూలైంది. నాకు ఆ రోజుల్లో లేనిపోనివి మనస్సులో అనేక వూహలు పుట్టుతూ వుండేవి. బాగా షోగ్గా డ్రస్ వేసుకొని, దర్జాగా సిగరెట్టు కాలుస్తూ బజార్లో తిరగాలనీ, యెదురుగా వచ్చే అందమైన యువతుల్ని ముద్దెట్టుకోవాలనీ అనిపించేది.

నాకు యెందుకనో మిలిటరీలో చేరాలని బుద్ధి పుట్టింది. ఉద్యోగంకోసము దరఖాస్తు పెట్టాను. తీరా అపాయంటు మెంటు రోజుల్లో మెడికల్ ఆఫీసరు నేను 'అన్-ఫిట్' అని వ్రాసియివ్వటముచేత ఆ ఆశ కాస్తా పోయింది. 'అన్-ఫిట్', అయిన జీవి, జీవించటము అనవసర మనిపించింది. నా తల్లిదండ్రులు నన్ను యింత దౌర్బల్యములో వుంచినందుకు వాళ్ళను యేమి చేసినా పాపము లేదనిపించింది. మరో ఉద్యోగము కోసము ప్రయత్నము చేయటానికి మనస్కరించలేను. ఒకవేళ యేదైనా వుద్యోగములో చేరినా సరిగా చేయలేనేమో ననే భయము యేర్పడింది. కాని నేను భటాచోరుగా తిరగటము మా తండ్రికి యిష్టములేను. అయునికి యే ఉద్యోగము కనబడకపోవటంచేత చివరకు తాపీ

పని నేర్చుకున్నా మంచిదేనని ఒక తాపీపని మేస్త్రీ దగ్గరకు పంపాడు.

మిలటరీ కంటోన్మెంటు ప్రక్కనే వొక మేడ కట్టటానికి మా మేస్త్రీ కంట్రాక్టు తీసుకున్నాడు. నేను గోడ కట్టడము దగ్గరున్నా నామనస్సు యెక్కడో వుండేది. కంటోన్మెంటు ప్రక్కకి తిరగ్గానే మా చుట్టము, మేము రోజూ చెప్పుకునే కబుర్లు తలుపుకొచ్చేవి. ఇవి కాకపోతే మిలటరీ వుద్యోగము - డ్రిల్లు, గుళ్ళబారులు యివన్నీ గుర్తుకు నేను యెక్కడున్నానో, యేమి చేస్తున్నానోకూడ మర్చిపోయేవాణ్ణి. నా మందబుద్ధిని చూచి మా మేస్త్రీ 'యిలావుంటే మాకు గిట్ట'దంటూ నన్ను పనిలోనుంచి వెళ్ళగొట్టాడు.

నాకు జీవితము సహారా యెడారి లాగా కనిపించింది. ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసులో గుమాస్తాగా చేరాను. ఒక రసాయన శాస్త్రజ్ఞుడి దగ్గర కొన్ని రోజులున్నాను. కలెక్టరు ఆఫీసులో కొంత కాలము గడిపాను. యెక్కడున్నా నా జీవితానికి హాయి అనేది కనబడలేదు. అసలు ఒకచోట నిలకడగా ఉండి పనిచేయుమంటేనే నాకు తలనొప్పిగా వుండేది. ఇది చిన్నతనమునుంచీ వున్న దుర్గుణము. మా తండ్రి నా అవస్థ తెలుసుకోలేక వొకటి రెండుసార్లు నన్ను ఇంట్లోనుంచి వెళ్ళిపొమ్మని బెదిరించాడు కూడాను.

ఇప్పుడు నాకు ఇరవై యొకటో యేడు వచ్చింది. ప్రేగ్ బజార్లో అటూ యిటూ తోచకుండా యేమీ పనిలేకుండా తిరగటము అలవాటైంది. కోటు జేబుల్లో చేతులు పెట్టుకొని ప్రక్కనే నిలవబడివచ్చే పొయ్యే వాళ్ళని, షావు ల్లోకి, హోటల్లోకి వెళ్ళేవాళ్ళని, కార్లమీద తిరిగే వాళ్ళని చూస్తూవుంటము నా పని. వాళ్ళను చూస్తూవుంటే నా అరికాలుమంట పైకెక్కేది. అందంగా డ్రెస్ వేసుకొని, టాయ్‌లెట్ ముఖాలతో సాయంత్రంపూట షికార్లుకొట్టు తూవుండే యువతుల్ని చూచి యేవో కలలు కంటూవుండేవాణ్ణి. వాళ్ళ బూట్సు ముద్దెట్టుకున్నా చాలనిపించేది. కాని నా స్టేటస్ చూచుకుంటే వాళ్ళు నా కందరనిపించేది. ఇలాంటిది జరిగినప్పుడల్లా నేను యెంతో బాధ అనుభవిస్తూ వుండేవాణ్ణి. వాళ్ళంతా ఆలా వుంటే నా స్థితి యిలా యెందుకు ఉండాలి. దీని కంతటికి కారణము వాళ్ళు బాగా వున్నవాళ్ళు కావటమే అని సమాధా నము చెప్పుకొన్నాను. వాళ్ళమీద వున్న ద్వేషం నాకు మరెవరిమీదా లేదు.

ఈ యువతులకోసము నేను యెలా పరితపించానో మీకేమి తెలుస్తుంది? మీకంటే కావలసినంత డబ్బుంది. కావాలంటే డబ్బు యిచ్చి యిష్టము వచ్చిన యువతిని కొనుక్కుంటారు; హాయిగా అనుభవిస్తారు. తరువాత యెప్పుడో పెళ్లి చేసుకొని కాపరము చేస్తారు.

యీ అవస్థ అనుభవించేది నేను వొక్కణ్నే కాను, నాలాగే యింకా చాలా మంది వున్నారని తెలుసుకున్నప్పుడు నా బాధ చెప్పటానికి వీల్లేకపోయింది. మేమందరము రోజూ ఒకచోట చేరేవాళ్ళము. కార్లమీద పోయేవాళ్లని గురించి, హోటళ్ళకు, సినిమాలకు పోయేవాళ్ళని గూర్చి గంటలతరబడి చర్చించుకునే వాళ్ళం.

మానవ చరిత్రని గూర్చి తెలుసుకోవాలని పుస్తకాలు చదవటము ప్రారంభించాను. తరువాత రాను రాను యెర్రట్ట లున్న పుస్తకాలు. వాటి పేర్లు వింటేనే మీలాంటి బూర్జువావారికం హడలిపోయే పుస్తకాలు చదివాను. యీ పుస్తకాలన్నీ చదవటానికి కారణం నేను, నాబోటి వాళ్లెంతో మంది యిలా యెందుకు అవస్త పడాలి, తక్కినవాళ్లు అనుభవించే భోగాలు మా కెందుకు లభించంటము లేదనే విషయము తెలుసుకోటానికే.

ఇక నా వాఙ్మూలము ఒకటి రెండు మాటల్లో ముగిస్తాను. నాకు ఎదురబడ్డ ఆ బూర్జువాని రివాల్వరుతో చంపటానికి యింతకన్న వేరే కారణము లేదు. అతనిమీద నాకు ప్రత్యేకముగా యేమీ ద్వేషము లేదు. ఆసమయములో యే బూర్జువా కనబడ్డా, జడ్జి స్థానములో వున్న మీరు కనబడ్డా, చివరకు నా తరఫున బాగా వాదించిన యీ నా ప్లీడరున్నా కాల్చివేసేవాణ్ణి. బూర్జువా అంటే వొక వర్గానికి చెందినవాడనీ, నాలాగా సోమరిపోతుగా వున్నా నాకంటే ఐశ్వర్యముతోనూ, సుఖముగానూ యెందుకు వుండాలని నా ప్రశ్న.

ఒకటి రెండు వారాల్లో నేను ఈ లోకమునుంచి మరో లోకము వెళ్ళబోతున్నాను. బహుశః అక్కడ ఈ తేడా వుండదనీ నా నమ్మకము. సెలవు.

# వంచితభర్త

నాగరకత కాలాని కంటే వెనకబడి దేకుకుంటూ వస్తున్నప్పుడు మానవుడు నిచ్చెన భుజాన వేసుకొని రోజుకు మూడుసార్లు పట్టణమంతా తిరిగి ప్రతి లాంతరుస్థంభము దగ్గరకు వెళ్లి చమురు పోసి, వెలిగించి, ఆరిపివేసిరావడం తప్పదు. కాని అట్లాంటప్పుడు ఆ మానవుడు ఎంత తాగుడుకు అలవాటుపడ్డవాడైనా ఎంత మంచిబుద్ధిగలవాడైనా అతని ఆలోచనలు తన నిచ్చెన ఎత్తు వరకైనా పోనిస్తాడనడంలో వింతేమీ లేదు.

సిసిలీదేశంలోని ట్రోనీపట్టణంలో లాంతర్లు వెలిగించే టోనియో వున్నాడే అతను ఒకరాత్రి తప్పతాగి ఆ నిచ్చెనమీదనుంచీ గూడా పడ్డాడు. ఆదెబ్బలో

అతను తల బద్దలు చేసుకొన్నాడు; కాలు విరగ్గొట్టుకున్నాడు. రెండు నెలలు ఆసుపత్రిలో తీసుకున్నమీదట కేవలం అదృష్టము బాగుండి బతికి బయట పడ్డాడు, పెద్ద మచ్చబడ్డతల, కుంటికాలు, అతను. మళ్లీ నిచ్చెన బుచ్చుకొని వీధుల్లో లాంతర్లు వెలిగిస్తానికి బయలుదేరాడు. కాని నిచ్చెన ఎక్కినప్పుడల్లా అనుకొంటూవుండేవాడు. ఎవడన్నా ఒకవిషయాన్ని పట్టించుకొని, పట్టించుకో నట్టుగావుంటే లోకం వాడివెంటబడి, వాడా విషయాన్ని పట్టించుకొనేటట్లు ఎందుకు చేస్తుందా అని. అది ఆలోచించినప్పుడల్లా అతనికి మహామంటగా వుంటుంది. ఉదాహరణకు ఒక భర్త తన భార్య తనకు చేస్తున్న నమ్మక ద్రోహాన్ని పట్టించుకోడనుకో. కాని లోకం వూరుకోదుగా. అతనికి నిమిష నిమిషానికీ గుర్తుచేస్తుంటుంది. అప్పటికీ అతను పట్టించుకోడనుకోండి. లోకం వూరుకోదు. పెద్దవాళ్లు మొదలుకొని పిల్లవాళ్లదాక అతనిచుట్టూ చేరేది, అతని భార్యసంగతి గుర్తుచేసేది, అతనికి చాటలు కట్టేది.

టోనిరో నిచ్చెన కొసకుపోయి లాంతరు వెలిగిస్తుంటే అంతా చుట్టూ చేరి "నీ పెళ్లాం ఎట్లా వుంది? ఆ అమ్మాయికి ప్రాణస్నేహితు డెవడు?" అని కేకలు వేస్తారు "పూ కడుపులుడకా: మీ కెందుకు నాసంగతి, పట్టణాని కంతటికి వెలుతు రిస్తానికి ప్రయత్నించే యిట్లాంటి సమయాల్లో వచ్చి మీరు నాకా సంగతి ఎందుకు చెబుతారు? మీ సంగ తేమిటో మీరు చూచుకో రాదూ? మర్యాదగా తన పొట్టకోసం తాను తిప్పలుపడే పెద్దమనిషిని అట్లాగే బతకనివ్వరాదూ?" అని టోనిరో సమాధానం చెప్పేవాడు.

కాని నిచ్చెనపైనుంచీ అప్పుడప్పుడు యిట్లా ఆలోచిస్తుండేవాడు. లాంతర్లు వెలిగించే యీ నా పని నా పెళ్లాన్ని కనిపెట్టివుంటానికి వీలులేకుండాచేస్తే అది నా దోషమా? రోజుకు మూడు సార్లు పట్టణమంతా తిరిగి లాంతర్లు వెలి గించాల్సివుంటే అతను తన భార్యా సంగతి ఎట్లా పట్టించుకోగలడు గనక.

కాని ప్రతివాళ్లు అతన్ని ఆటలు పట్టించడం మరీ ఎక్కువయ్యేసరికి పట్టలేక ఒకనాడు సలహా తీసుకొద్దామని టౌనుహాలుకు వెళ్లాడు. ఆమున్సిపాలిటీ కౌన్సిలర్లల్లో ఒక కౌన్సిలరుగా వున్న జమీందారుడు ఓస్సీ దగ్గరకు వెళ్లాడు ఎకాయెకి. టోనిరోకి వుద్యోగం రావటానికి, అతని పనితనానికి మెచ్చు కొని అప్పుడప్పుడు మున్సిపాలిటీవాళ్లు బహుమానాలు యివ్వడానికి, అన్నిటికీ గూడా బిస్సీయే కారణం.

తన ప్రభువైన బిస్సీ దగ్గరనుంచి టోనిరో మొట్ట మొదటగా తెలుసుకో దలుచుకుంది ఏమిటంటే తను పట్టణంలో లాంతర్లు వెలిగిస్తూవున్న సమయాల్లో తను గూడ ఆపట్టణంలోని అధికారుల్లో ఒకడవుతాడా కాడా అన్నవిషయం.

"తప్పకుండా అవుతావు" అన్నాడు బిస్సీ. "కనక అట్లాంటి సమయాల్లో నన్ను అవమానం చెసేవాళ్లు యీ పట్టణ అధికారుల్లో ఒకణ్ణి అవమానం చేసిన వాళ్ల లెక్క కిందకే వస్తారన్న మాట."

"అట్లా ఎట్లా అవుతుంది" అని సమాధానం చెప్పాడు కౌన్సిలర్ బిస్సీ. వ్యక్తిగతవిషయాలకు అధికారానికి సంబంధంలేదని. అతనిభార్యాసంగతులు మాట్లాడి అతన్ని అవమానపరిస్తే లాంతర్లు వెలిగించే అధికారిగా అతన్ని అవమానించినట్లు అవదని నచ్చజెప్పడానికి బిస్సీ ప్రయత్నించాడు.

"ప్రభువులు మీకు తెలియంది ఏదీలేదనుకోండి. కాని నేను నిచ్చెన ఎక్కి లాంతర్లు వెలిగించే సమయంలో నన్ను అవమానపరుస్తారనుకోండి. అప్పుడు ఏమిటి? పట్టణాన్నంతా చీకటిలో ముంచేసి లాంతర్లు వెలిగించే సమయంలో వెలిగించకుండా యింటికి పరుగెత్తి నా పెళ్ళాన్ని కాపలాకాచి అవసరమైతే దాని తల, దాన్ని వుంచుకున్నవాడి తల బద్దలు చేస్తానికై వెళ్లలేనన్న సంగతి వాళ్లకు తెలుసాయె, మరి నేనేమి చెయ్యాలి చెప్పండి? నా స్థితిలో ప్రభువులు మీరే వుంటే ఏం చేస్తారో చెప్పండి?"

"అవసరమైతే దానితల, దాన్ని వుంచుకున్నవాడి తల బద్దలు చేస్తానికై" అన్న మాటలు టోనియో గాలా నొక్కిచెప్పాడు. అతనికి తెలుసు. అన్యాయం జరిగిన ఒకభర్త హంతకుడుగా గూడా తయారయి అతని ప్రతిష్ఠని కాపాడుకోవాలని లోకం శాసిస్తుందని ఏవిధంగా సలహా యివ్వాలో తెలియక బిస్సీ గుంజాటన పడ్డాడు.

"ప్రభువులకు యింకో నిదర్శనంగూడా యివ్వమంటారా? వెన్నెల రాత్రిళ్లు లాంతర్లు వెలిగించకుండా వుటామే, అప్పుడు ఎవరూ గూడా నా పెళ్ళాం సంగతి నా దగ్గర ప్రస్తావించరు. ఏందుకని? వాళ్ళకు తెలుసు. ఆ రోజుల్లో నేను పట్టణంలోని అధికారుల్లో ఒకణ్ని కానన్న సంగతి. ప్రభువులు చిత్తగించాలి. ఈ విషయంలో ఏదో ఒకటి చెయ్యాలని నా అభిప్రాయం. అంతేకాదు. పోలీసాళ్ళకు గూడా యీ విషయం తెలియ జెయ్యాలి."

టోనియోవాదన బాగానే వుంది. కాని దానివల్ల ఏమీ ప్రయోజనం లేదు. టోనియో నిజంగా అట్లా అవమానింప బడడానికి యిష్టపడకపోతే? తన పెళ్ళాం చెడిపోడానికి లాంతర్లు వెలిగించే తన వుద్యోగమే కారణమని అతను అభిప్రాయపడుతుంటే? అతను చెయ్యవలసిన పని ఏమిటంటె తనవుద్యోగాన్ని ఒదులుకోడం. అట్లాగాకండా అతను తన వుద్యోగాన్ని వొదులుకోలేకపోతే, లోకులుచేసే ప్రచారాన్ని లెక్కచెయ్యకుండా ఉండడమే మంచిసంగతి. ఇదీ అతని ప్రభువు అతని కిచ్చిన సలహా.

"ఖచ్చితంగా అంతేనంటారన్నమాట. ప్రభువులు"

"ఆ, ఖచ్చితంగా అంతే నేమోనని నాభయం" అన్నాడు బిస్సీ.

టోనియో నిటారుగా నిలబడి మిలిటరీ శాల్యూట్ చేశాడు.

"అవును, ప్రభువులు మీరు చెప్పిందే నిజం. నా వుద్యోగాన్ని నేను అట్టి పెట్టుకోడమే మంచిది."

కాని అతనికి రోజురోజుకూ తన నిచ్చెన బరువెక్కుతూంది. ప్రతి రోజూ తన కుంటికాలు నిచ్చెన పైకి యీడ్చుకుంటూ పోవడం అంతా అతనికి చాలా విసుగు, విరక్తి కలిగిస్తున్నాయి. జీవితం నానాటికీ, బాధాకరంగా వుంటూంది. ఆకొండ శిఖరం మీదవున్న ఆఖరి లాంతరు స్థంభాన్ని వెలిగించడానికి వెళ్ళేటప్పుడు అతను నిచ్చెన మీద వేలాడుతూ కాసేపు అట్లాగే వుండిపోయేవాడు. అట్లాంటి సమయాల్లో తన కర్తవ్యాన్ని, తన ప్రభువు యిచ్చిన సలహా అన్నీ మరిచి పోయేవాడు. అట్లాంటి సమయాల్లో ఎన్నో ఆలోచనలు మీద ఆలోచనలు పుడుతూవుండేవి అతనికి.

కొన్ని కొన్ని ఆలోచనలు చాలా విపరీతంగానూ, విషాదపూరితంగానూ వుండేవి. ఉదాహరణకు అతను అప్పుడప్పుడు యిట్లా ఆలోచిస్తూవుండేవాడు. ఆకాశంలో అన్ని నక్షత్రాలు, అంత ప్రకాశమానంగా వున్నా భూమిమీద కావలసినంత వెలుతురు కలిగించ లేకపోతున్నాయి. ఎంత వ్యర్థం : కాని నక్షత్రాల్ని వెలిగించుకొన్న ఆకాశం ఎంత మనోహరంగా వుంటుంది. అతను ఒకసారి కలగన్నాడు. ఆకాశంలోని నక్షత్రా లన్నిటిని వెలిగించే వుద్యోగం తన కిస్తే వాటిని అందుకునేటంతటి పొడుగుపాటి నిచ్చెన వుపయోగిస్తానికి ప్రయత్నించాడు. కాని ఆ నిచ్చెను పై చివర కనిపించక చాలా అవస్థపడ్డాడు. దాన్ని బుజాన వేసుకొని మొయ్యలేక చాలా బాధపడ్డాడు. అబ్బా: ఆరాత్రి తనుఆకాశము పైకివెళ్ళి నక్షత్రాల్ని వెలిగించలేనేమోనని అతను నరక యాతన అనుభవించాడు, కలే ననుకోండి. అయితేమాత్రం. ఎంత బాధ పడ్డాడు అతను. లాంతర్లు వెలిగించేవాడి వుద్యోగం ఎంత విషాదపూరితమైంది. అతను అప్పుడప్పుడు యిట్లా ఆలోచించుకొనేవాడు. వెలుతుర్ని సృష్టిస్తూ తన నీడల్ని కూడా సృష్టిస్తున్నాడు. ఎప్పుడూ కూడా ప్రపంచం ద్వంద్వ భూయిష్టమైంది. ఒకటి సృష్టించబడింది. అంటే దాని ప్రతికూడా వుండి తీరుతుంది. దాన్ని వ్యతిరేకించేది లేదు అంటే అదీ లేదన్నమాటే. ఎప్పుడూ కూడా మృత్యువు జీవితాన్ని వెంటాడుతూ, వెనకనే వుంటుంది. నీడ మృత్యువు లాంటిది. ఒక వస్తువుయొక్క సర్వసంచలనాల్లోనూ యీ నీడ దాన్ని వెంటాడుతు నే వుంటుంది.

"ప్రజలు నేను ఎప్పుడూ వెలుతురిని ప్రసాదిస్తానని అనుకుంటారు. కాని నా లాంతర్లు ఎప్పుడు వెలగటానికి ప్రారంభిస్తయో అప్పుడే వారిని మృత్యువు వెంటాడటానికి ప్రారంభిస్తుంది." లాంతర్ల ప్రక్కగా పోయే వ్యక్తుల్ని, వాళ్ల నీడల్ని చూస్తూ అతనిట్లా ఆలోచిస్తుండేవాడు.

ఎంతైనా తన వుద్యోగానికున్న ప్రాముఖ్యత మరిదేనికీ లేదుగదా అని చివరకు అనుకొంటూ వుండేవాడు. ప్రకృతి చెయ్యలేని పని తను చేస్తున్నాడు. ప్రకృతి కొంత యివ్వలేని సమయాల్లో తను యివ్వ గలుగుతున్నాడు. టోనియో కోతలు కొయ్యడమంటే అసహ్యించుకొంటాడు. కాని ఆపట్టణానికి అతను రెండోసూర్యుడే అని చెప్పాలి. ఆ పట్టణంలో సూర్యుని ప్రతినిధులుగా తను, చంద్రుడు, యిద్దరే పనిచేస్తున్నారు. చంద్రుడు ప్రకాశిస్తున్నంతకాలం తను విశ్రాంతి తీసుకొంటాడు. చంద్రుడు విశ్రాంతి పుచ్చుకున్నప్పుడు తను వెలుతురు నిస్తుంటాడు. కాని చంద్రునికంటే గూడా టోనియో గొప్పవాడు. కాదని ఎవరనగలరు ? ఒకో సమయంలో చంద్రుడు వెలుగుతున్నా మబ్బులు అడ్డువచ్చినప్పుడు వెలుతురు యివ్వగలుగుతుంది ఎవరు టోనియో గాక.

చంద్రుడులేని రోజుల్లో చుట్టూ అంధకారము ముసురుకొని వుంటే, మధ్యలో, ముట్టించిన లాంతర్లతో వెలిగే పట్టణం చూస్తానికి ఎంత శోభాయ మానంగా వుంటుంది.

అట్లాంటి సమయాల్లో ఆ చిన్ని చిన్ని లాంతర్లు ఆ గాఢాంధకారాన్ని చీల్చుకొంటూ ఎంత ఆశాజనకంగా కనిపిస్తుంటాయి. అప్పుడప్పుడు వీచే గాలికి ఆ చిన్న లాంతర్లు అన్ని గూడా కదిలిపోయి నిట్టూర్చుతున్నట్టుగా తోస్తుంది. వాటిని దూరాన్నుంచి చూస్తుంటె బ్రతుకుని అశాంతిలో, అసంతృప్తితో గడిపి గతించిన జీవులన్నీ ఒకచోట జేరి ఒకదానొ్నకటి ఓదార్చుకుంటున్నాయా అన్నట్లు తోస్తుంది. కాని అట్లా జరగనే జరగటము లేదు. ఎక్కడైనా ఒక యిల్లు లేచిందా అంటే దానికి యీడు జోడుగా పక్కనయింకో యిల్లు లేవదు. సరిగ్గా ఆ మొదటింటికి ఎదురుగా దాని దృశ్యము అందరికీ కనబడకుండా వుండేటట్లు లేస్తుంది మరో యిల్లు. అదే విధముగా మానవులు గూడా ఒకరికొకరు సహాయము చేసుకుందామని ఎప్పుడు ఆలోచించరు. ఒకరితో ఒకరు విరోధముగా నిలబడి యుద్ధము చేస్తానికే సిద్ధపడతారు. టోనియోకి యిదంతా తెలియక పోలేదు. ప్రతి యింట్లో గూడా ఒకరి నొకరు ప్రేమించుకోవలసిన యిరువురి వ్యక్తుల మధ్య గూడా పోరాటము వున్నదని అతనికి తెలుసు. అత నింట్లో మాత్రము యుద్ధము జరగటములా? మాటసామెతకు అతని భార్య కంటె అతనికి కటిక విరోధి యిం

కెవరున్నారు? టోనియో తాగుడుకు అలవాటు పడ్డాడంటే ఎందుకు ? తన యింట్లో జరుగుతున్న అత్యాచారాన్ని దిగమింగి, మరిచి పోడానికి కాదూ అతను తాగుడుకు అలవాటుపడినది ?

* * * *

కాని టోనియో ఏమి చేస్తున్నాడు ? ఆ రాత్రి లాంతర్లు వెలిగిస్తానికి వాటిల్లో చమురు లేదని అతనికి తెలీదు ?

పట్టణమంతా ఆ రాత్రి కటిక చీకటిలో మునిగి పోవలసిందే. లాంతర్లు వెలిగించటానికి కంట్రాక్టు పుచ్చుకొన్న కంట్రాక్టరు మునిసిపాలిటీ వాళ్ల మీద దావా తెచ్చాడని వాళ్ళు అతనికి డబ్బివ్వడమే మానేసారు. మీ తిక్క యిట్లా వున్నదాఅని ఆ కంట్రాక్టరు లాంతర్లలో నూనె పొయ్యడమే మానేశాడు. టోనియో ఆ నూనెలేని లాంతర్లనే వెలిగిస్తానికి ప్రయత్నిస్తున్నాడు ఆ రాత్రి. కాని ప్రయోజనం. వెలిగించీ వెలిగించకమునుపే టఫ్ టఫ్ మంటూ లాంతర్లు ఆరిపోవడమూ, పొగ వాసన రావడమూ జరుగుతూంది. పట్టణమంతా అతని మీద ఆ రాత్రి యుద్ధాన్ని ప్రకటించింది.

''టోనియో యిక నువ్వు యింటికి వెళ్లు. నీ పెళ్ళాం ప్రాణస్నేహితు డెవడు?'' చిన్నపిల్లలంతా చుట్టూచేరి చప్పట్లు కొట్టారు. టోనియో అది భరించలేక పోయాడు. అల్లరి బాగా ఎక్కువయింది.

''లాంతర్లు వొదిలిపెట్టి పోవోయ్. కాపలావుండాల్సినది లాంతర్లకు గాదు, నీ పెళ్ళానికి'' అల్లరి మరీ ఎక్కువ అయింది. టోనియో అపాదమస్తకము మండిపోయాడు. నిచ్చెన భుజాన వేసుకొని పెద్దబజారునుంచీ తప్పించుకొని ఒక చిన్న సందులో దూరాడు. అప్పటికీ జనము చుట్టూ మూగారు. వాళ్ల గొడవ పట్టించుకోనట్లుగా నిచ్చెన లాంతరు స్థంభానికి వేసి టోనియో ఎక్కబోతూంటే వాళ్ళింకా పెద్దగా కేకలు వేస్తూనే వున్నారు.

''నీ పెళ్లాం. నీ పెళ్లాం. ఆ అమ్మాయి ప్రాణస్నేహితు డెవడు?'' టోనియోకు విసుగుపుట్టి నిస్పృహతో లాంతరు స్థంభము పూసల్ని ఆధారము చేసుకొని దాన్ని కావలించుకోడానికి కాస్త వొరిగీ, వొరగక మునుపే కాళ్ల కింద నిచ్చెన లాగారు. ఆపర్ని టోనియో లాంతరు స్థంభము పూసల్ని పట్టుకొని పట్టుకోసం వెతుకుతూ కాళ్ళు వేళ్లాడేసి గిజగిజ కొట్టుకున్నాడు. అతని కళ్ళు గిర్రున నీళ్ళతో నిండినయి. వాళ్ళు ఎందుకతన్ని అట్లా కష్టపెట్టటము? అతని మీద సాధించదలచుకున్న పగ ఏమిటి? అతని కుటుంబ వ్యవహారాలతో వాళ్లకేమి పని? ఆ వేళ లాంతర్లు వెలిగిస్తానికి నూనె లేదు గనుక అతణ్ని హంతకుడు గమ్ముంటారా? అతని యిష్టములేని అట్లాంటిపనే గనక వాళ్లతని

చేత చేయించ దలచుకుంటే నిచ్చెన లాగడము దేనికి? నిచ్చెన తెచ్చిస్తే అతను దిగొచ్చి, లాంతర్లు వెలిగించే టోనియో అతని పెళ్ళాం తల దాని రంకుమొగుడు తల ఎట్లా బద్దలు కొడతాడో ప్రత్యక్షముగా చూపిస్తాడుగా. నలుగు రైదుగురు ఎట్లా అయితే నేమి తిరిగి నిచ్చెన తెచ్చియిచ్చారు. పగసాధిద్దామన్న తే క్రోధముచేత అతనికళ్లు నిప్పుకణాల్లాగ మండుతున్నయ్. అతను యింటి వైపుకు నడిచాడు, తొందర తొందరగా.

"ఓ. ఒథెల్లో మహాశయా! నీ దగ్గర పెద్ద కత్తి ఏదన్నా వున్నదా" అని గుంపులోనుంచి ఒకడు అరిచాడు.

"ఆఁ వుంది. ఇదుగో," జేబులో నించి పెద్ద బాకు తీశాడు టోనియో.

"అమ్మో! చాలా పెద్దదే. దానితో నిజముగా ఒక దున్నపోతుని చంపొచ్చు"

"నీ పెళ్ళాన్ని, ఆవిడ రంకు మొగుడ్ని యిద్దర్ని చంపుతావా?"

"ఆఁ యిద్దర్ని చంపుతా. పందుల్ని పొడిచినట్లు పొడుస్తా. మీరు వచ్చి పరీక్ష చెయ్యండి. నా వెంట రండి. మీరు చూస్తారుగా" ఆ చీకటిసందుల్లో నించి, బరువుగా, బాణములాగా ముందుకి దూసుకు పోయాడు టోనియో. వెనకనే గుంపులు గుంపులుగా జనం వెళ్ళారు.

"అయితే ఓ. ఒథెల్లో మహాశయా, నిజముగా చంపుతావా యేమిటి?" టోనియో ఆగాడు. ఆగి వెనకవస్తున్న జనములో ఒకణ్ని చెయ్యిపట్టుకొని ముందుకు గుంజాడు. "ఏమిటి నీవుద్దేశ్యము. టోనియో మాటంటే మళ్లా వెనక్కి జారుతాడనే! నే నెట్లాంటి వాణ్ణని మీ అభిప్రాయము? అయితే నువ్వు భయపడుతున్నా వన్నమాట. టోనియో పిరికిపంద అనుకున్నావా? రా నా వెంట. మీ రంతా రండి. విశ్వాసం లేని తన పెళ్ళాన్ని, దాని రంకు మొగుణ్ని టోనియో ఏమిచేస్తాడో మీ రంతా చూడాలి." పట్టుకున్న మనిషిని చాలాసేపు అటూ యిటూ బాగా వూపి తిరిగి యింటి ముఖము పట్టాడు టోనియో. గుంపులో చాలమంది భయముతో యింకా రెండడుగులు ముందుకు వేసి నెమ్మదిగా వెనక్కి జారుకున్నారు. పెద్దవాళ్ళల్లో నలుగురు, పిల్లల్లో యిద్దరు మాత్రము టోనియో యింటిదాకా వెళ్ళారు. వాళ్ళయినా ఒక హతలీ జరుగుతుంటే చూద్దామని గాదు అందాకా వెళ్ళింది. ఎట్లాగైనా ఆ విషాద సంఘటన జరగకుండా ఆపుదామనే. ఎప్పుడైతే టోనియో తన గడపదాకా వెళ్ళాడో అప్పుడు వాళ్ళు అతన్ని పట్టుకొని, కల్లు తాగుదాము పదమని లాక్కుపోవడానికి ప్రయత్నించారు. కాని టోనియో ఎక్కడ లేనికోపము తెచ్చుకొని కత్తిచూపించి, డొక్క బద్దలు చేస్తానని బెదిరించాడు వాళ్లని. తలుపు ఒక్క తన్ను తన్ని పెళ్ళాన్ని కేక వేశాడు.

" తెరువు తలుపు, తెరువు. చండాలపు ముండా. నీ పాపము పండింది. అనుభవిద్దువుగాని. తెరువు తలుపు" అతని చుట్టూ వున్నవాళ్ళు అతణ్ణి ఆపడానికి తిరిగి ప్రయత్నించారు. కాని నిరర్థకమైంది. "నన్ను వొదిలి పెట్టండి లేదా మిమ్మల్నిగూడా ఖూనీ చేస్తా" పెద్దగా అరిచాడు టోనియో. ఈసారి ఎక్కడ వాళ్ళక్కడ వెనక్కుతగ్గారు. టోనియో కోటుజేబులోనుంచి తాళపు చెవి తీసి. తలుపు లోపలకు పోయి గభాలున తలుపు బిగించాడు. జనమంతా తలుపు చుట్టూ చేరి కాకి గోల చేస్తున్నారు. "సహాయము, సహాయము" అని కేకలు వేస్తున్నారు. లోపలి నించీ ఏడుపు వినిపిస్తూంది. "హత్య,హత్య" అని కేకలు కేస్తూనే టోనియో తన పెళ్ళాం జుట్టు పట్టుకొని లాగాడు. బట్టలు సగము వూడిపోయి వున్న తన పెళ్ళాన్ని అట్లాగే యిసిరి నేలకేసి కొట్టాడు. ఆపర్ని మంచకింద చూశాడు. బీరువాలో చూశాడు. వంటగది చూశాడు. ఇల్లంతా చూశాడు. వెతుకుతున్నప్పుడల్లా " మాట్లాడు. వాణ్ణి ఎక్కడ దాచావు. మాట్లాడవేం" అని గద్దిస్తూనే వున్నాడు.

"నీ కేమన్నా పిచ్చెక్కిందా? లేకపోతే గొంతువరకు తాగి వచ్చావా?"

బజారులో గుంపు మరీ పెద్దదయింది. అక్కడక్కడ కిటికీలు తెరిచి వున్నయి. ప్రతివారూ, "ఎవరది? ఏమిటి జరుగుతున్నది? అవిడ్ని చంపుతాడా యేమిటి యింతకీ" అని కేకలు వేసేవాళ్లే. తిరిగి అంతా ఒక్కసారి తలుపుల్ని తన్ని దబ దబా బాదారు.

టోనియో తిరిగి పెళ్లాన్మీదికి గూకాడు. "వా డెక్కడున్నాడు చెప్పు, లేదా నిన్ను చంపేస్తా. రక్తము కళ్లచూస్తా. ఇవ్వాళ రాత్రి రక్తము కాలవలు గట్టాలి. వా డెక్కడున్నాడు చెప్పవా?" యింట్లో యింకా ఎక్కడ దేవులాడాలో అతనికి తోచలా. అకస్మాత్తుగా అతని చూపు వంటింటి కిటికీ మీదికి పోయింది. ఆ కిటికీ తలుపులు యింతవర కెప్పుడూ తెరవనేలేదు. కడ్డీలన్నీ మసిపట్టి వున్నయి.

"ఒక కుర్చీతెచ్చి ఆ కిటికీ తలుపులు తెరువు" పెళ్లాన్ని ఆజ్ఞాపించాడు. కాని ఆవిడ తెరవటానికి గుంజాటన పడింది.

"అఁహాఁ, సరే. నీకా తలుపులు తెరవడానికి అంత యిష్టము లేకపోతే నేనే తెరుస్తాలే."

ఒక పీటమీద యెక్కి ఆ కిటికీ తలుపులు తెరిచాడు టోనియో.........
భయానకమ్. టోనియో నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. అతని కళ్లు బయర్లు కమ్మినయి. భయోత్పాతములో కదిలిపోతున్న తల వెంట్రుకల్లో చేతులు దూర్చాడు. చేతిలోనుంచి కత్తిజారి కిందపడింది. అంతపైన ఏమాత్రముగూడా

కాలికి పట్టులేకుండా కేవలము గాలిలో నిలబడ్డాడా అన్నట్టుగా నిలబడి వున్నాడు జమీందారుడు బిస్సీ.

"ప్రభువులు!......యిక్కడ!...కాళ్లుజారి పడిపోయే యిట్లాంటి అపాయకరమైనచోటా!....ప్రభువులు కాలుజారితే ఏమయ్యేది! ప్రాణాలు పోయేవే! ......దొరగారూ, ఒక కాలు నా భుజముమీద పెట్టండి......జాగ్రత్త దొరా!......కాలు జారేను సుమా!"

పెళ్లాం వైపుకు తిరిగి ముఖము పగిలేటట్లు లాగి ఒక దబ్బకొట్టి "దొంగ ముండా, కాలుజారితే ప్రభువుల ప్రాణాలు పోయేవి గదా? అది తెలిసీ ప్రభువుల్ని ఆ కిటికీ ఎట్లా ఎక్కించావే? ప్రభువుల్ని దాస్తానికి నీకు అంతకంటె పరిశుభ్రమైన ప్రదేశమే దొరకలా? బ్రష్ తీసుకురా త్వరగా, ప్రభువుల కోటు బూజు దులుపుతా. నేను ఇల్లంతా దేవులాడా గాని ఆ పెద్ద అలమార తీసి చూడలేదని నీకు తెలీదూ! అక్కడ ఎట్లాంటి అపాయములేకుండా మనిషి దాక్కోవచ్చని నీకు తెలిదు! ఏ ఆడదైనా యింత తెలివితక్కువది వుంటుందీ?

దొరా! మీ కోటు దులుపనీండి. మీ రక్కడ వుంటారని నేను ఎట్లా వూహించుకోగలను? ప్రభువులు దయచేసి నాలుగు నిమిషాలు ఆ అలమరలో దాక్కుంటారు? ఇంతలోకి నేను బైట మూకను సర్దుమణుస్తాను. వాళ్ల కేకలు మీకు వినపడుతున్నాయా? వాళ్లుమిమ్మల్ని గనక చూశారా నలిపిపారేస్తారు. క్షమించండి, ప్రభువులు. యింత చండాలము జరిగింది. మరింకొకందే నేనేమి చెయ్యగలను చెప్పండి? ఒక మానవుడికి యిష్టము లేకపోయినా అతని అభిప్రాయానికి వ్యతిరేకముగా వున్న పనులుగూడా కొన్ని విధిలేక చెయ్యాలనివస్తుంది. ప్రభువులు......దయచేసి......ఆ అలమరలో......వాళ్లు త్వరగానే వెళ్లిపోతారు.

బిస్సీప్రభువు అలమరలో దూరిన తరువాత టోనియా బార్లగా తెరచివున్న తన పడకగది కిటికీ దగ్గరకు వెళ్లాడు. జనము అక్కడ యింకా కేకలు పెడుతూనే వున్నారు.

"వెధవల్లారా! యిక్కడ హత్య జరగబోతుందని నిజంగానే అనుకుంటున్నారా? ఇల్లంతా ఖాళీగానే వుంది. నాభార్య తప్ప యింకెవరూ లేరు. ఆవిడ ఒక్కతే కూర్చొని వుంది. మీకు నామాట మీద నమ్మకములేకపోతే రండి, ఒక్కసారి మీరంవరూ వచ్చి మా యిల్లంత చూచిపోండి. మే మిద్దరం తప్పితే యింట్లో నెవ్వరూ లేరు. నేను నా ప్రియమైన భార్యా యిద్దరమే."

# అందమైన పెళ్లాం

నేనూ పాల్ చిన్నప్పటి నుంచీ బాగా కలసి మెలసి తిరుగుతూ వుండే వాళ్ళం. నాకు అతడు ముఖ్యస్నేహితుడు కూడాను. అతడు పెళ్లి చేసుకున్న తరువాత అతడు వెంటనే టవున్ విడిచి పెట్టడంచేత కొన్నాళ్లపాటు మేము తిరిగి కలుసుకోలేదు. ఒకనాడు యెక్కడినుంచో వస్తూ బజార్లో అకస్మాత్తుగా యెదురుపడ్డాడు. ఒకరిచేతులు ఒకరు కలిపాం.

అతడు పెళ్లిచేసుకున్న తరువాత మే మిద్దరము కలుసుకోటమదే. అతనిలో కొంత మార్పు వచ్చినట్లు కనబడింది. నేను తమాషాగా అతనితో యిలా అన్నాను.

"పాల్! నీవు అప్పుడే పెళ్లి చేసుకోడము నాకు యేమీ బాగాలేదు. చూశావా! అప్పటి కప్పుడే సంవత్సరము కావస్తుంది. ఇంక కొంత కాలము నా లాగే బ్రహ్మచారిగా వుంటే బాగుండేది......అయినా యేమి చేస్తావ్? ఆడవాళ్లని చూచి పెళ్ళి చేసుకోవాలనిపించి వుంటుంది."

పాల్ పక్కున నవ్వాడు. మే మిద్దరము అలాగే మాట్లాడుకుంటూ ప్రక్కనున్న హోటలు వైపుకు నడిచాము.

చిన్నప్పటిసంగతి వొకటి గుర్తుకు వచ్చింది. ఒకప్పుడు మేమూ మేరీ కలిసి మెలసి తిరిగాము. ఒకళ్ళ నొకళ్ళు ప్రేమించుకున్న రోజులుకూడా వున్నై. జీవితము అంతా అలాగే గడపాలని కూడా మేము అప్పుడు శపథము చేసుకున్నాము. కాని పాల్ మరో స్త్రీని పెళ్లి చేసుకున్నాడు. మరి మేరీ సంగతి యేమిటి? పాల్ ఆ సంగతే మరిచి పోయినట్లు—కనీసము మరిచిపోవాలని దృష్టిలోవున్నట్లు కనపడ్డాడు. నేను అతని ముఖలక్షణాలు పరిశీలిస్తూ యెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాను. అతనిలో యిదివరకంటే బూర్జువా తత్వం మూగతనము ఇప్పుడు యెక్కువగా వున్నట్లు కనపడ్డయి. ఈ మార్పు పెళ్లి వల్ల కలిగినదేమో ననుకున్నాను. సిగరెట్టు కాలుస్తూ అత నేదో ఆలోచిస్తూ వున్నాడు.

"యేమిటీ! ఆలోచిస్తున్నావ్? పెళ్లి సంగతి కాదుగదా. నీకేమ్, చక్కని పెళ్ళాన్ని చేసుకున్నావ్."

నిజముగా పాల్ భార్య్యా చాలా అందగత్తె. నాజీవితములో మరెక్కడా నేనలాంటి సౌందర్యముగల స్త్రీని చూడలేదు. పాల్ మీద నాకున్న చనువు చేత నేను యీ మాటలు అనగలిగాను.

అతడు చటుక్కున ముఖము నా వైపుకు తిప్పాడు. నా మాటలు అతని ముఖములో సంతోషము గానీ నవ్వు గానీ కలిగించినట్లు లేదు. కాగా సీరియస్ నెస్ ఎక్కువైంది.

"భలే పెళ్లాం...భలే పెళ్లాం" ప్రతివాడూ యిదేమాట. నిజముగా బాధ్యత తెలిసినవాళ్లు అనవలసిన మాట కాదు. ఇకెప్పుడూ యిలా అనబోకు" అని పాల్ అన్నాడు.

పాల్ కి కోపము వచ్చిందేమో ననుకున్నాను. ఇది నాకు మొదటి వార్నింగ్ అనుకున్నా. అసలు చక్కని యువతుల్ని చేసుకున్న వాళ్ళంతా యిలాగే మారతా రనిపించింది."

"నీకు కష్టంగా వున్నట్లుంది. ఇకెప్పుడూ యిలాంటి విషయాలు యెత్తను లే.

పాల్ ముఖంలో సీరియస్ నెస్ మాయమైంది. మళ్ళీ అతను నవ్వటం ప్రారంభించాడు.

నా కేమీ కష్టము లేదు. కాని నీ అమాయకత్వము చూస్తే నాకు నవ్వొస్తుంది. చక్కగా అందంగా వున్న వాళ్ళను చేసుకుంటే ఇతరులు అనుకునేటంత సుఖము లేకపోగా అప్పుడప్పుడూ విచారముకూడా కలుగుతుంది. 'తాను అందమైన దాన్ని' అని ఆడది అనుకుంటే యిక మగవాడి అవస్థ చెప్పటానికి వీల్లేదు. ఇది నా అనుభవము మీద చెప్పుతున్నమాటలు. ఈ రోజే దానిమీది నెల్ల నుంచీ నా అవస్థ చెప్పటానికి వీల్లేదు. అయినా నీవు ముఖ్య స్నేహితుడివి కాబట్టి చెప్పుతాను విను" అని పాల్ పెళ్ళి నాటి నుంచి తన స్వీయ చరిత్ర ప్రారంభించాడు.

"పెళ్ళి రోజునవున్న సంతోషం గానీ సుఖంగాని నాకు యిప్పుడు లేదు. ఆ నాడు వూహాప్రపంచంలో నేను కట్టిన సౌధాలకు అంతులేదు. ఆమె సౌందర్యాన్ని చూచి నేను వుప్పొంగిపోయ్యాను. ప్రపంచంలో యిక నేను కోరే సౌఖ్యం వుండదనుకున్నా. కాని నేను అనుకున్నదంతా వొట్టి హంబక్కుగా కనపడింది.

"పెళ్ళి కాగానే మే మిద్దరం మ్యూనిక్ వెళ్ళాం. ఆమెకు దేశాలన్నీ చూపాలనీ, అలా చూపితే ఆమె సంతోషిస్తుందనీ అది నాకు పరమానందం అనీ అప్పటి నా వుద్దేశ్యం. మ్యూనిక్ పట్టణం చూపించాలనీ, అక్కడున్న నా స్నేహితులతో పరిచయం కలిగించాలనీ తరువాత బవేరియా తీసుకొని వెళ్ళాలనీ నా మొదటి ప్లాను. బయలుదేరిన రోజుల్లో మే మిద్దరం చాలా సుఖంగా కాలం గడిపాము. అందులో సందేహము లేదు కాని రోజులు గడిచినకొద్దీ ఆమెలో మార్పు కలుగుతున్నట్లు తోచింది. ఆమెకు ఆ ప్రయాణం

సుఖంగా వున్నట్లు కనబడలేదు. చివరకు నేనే అడిగాను.

"యీ పట్టణం నీ కెలా వుంది ? నచ్చిలా ?"

మొట్టమొదట సమాధానం చెప్పలేదు. ఒకటికి రెండుసార్లు గుచ్చి గుచ్చి అడగ్గా యిలా చెప్పింది.

"మ్యూనిక్ పట్టణం అంటేనే నాకు అసహ్యం వేస్తుంది. ఇచ్చటి ప్రజలు ఒట్టి అనాగరికులు. ఎలా ప్రవర్తించాలో తెలియదు."

నాకు ఆశ్చర్యం వేసింది. అసలు ఆమె అలా యెందుకందో నాకు అర్థం కాలేదు.

"మీ రేమన్నా అనుకోండి ఇచ్చటి వాళ్లంత చచ్చురకాన్ని నేను యెక్కడా చూడలేదు. ప్రొద్దస్తమానం బజారులో తిరుగుతూ వుంటారు. ఒకరితో ఒకరు కలవరు, మాట్లాడుకోరు. కనీసం ఒకరి ముఖంకేసి ఒకరు చూడనైనా చూడరు. ఇలాంటి జనాన్ని మ రేమనాలో నాకు తెలియదు.

నా భార్యవంక యెవరూ చూడలేదని ఆమెకు కోపం. అందుకని ఆమె మ్యూనిక్ వాసుల్ని అనాగరికుల కింద కట్టివేసింది. బజార్లో పోయే వాళ్లంతా తనవంకే చూడాలని అందంగల స్త్రీ కోరుకుంటుందనీ, అలా చూడకపోతే ఆమెకు కష్టంవేసి వెళ్ళేజనాన్ని తిట్టుతుందనీ, నా భార్యక్కూడా యిదే జాడ్యం పట్టుకుందనీ నేను అప్పుడు గ్రహించాను.

"ఇంతే కాదు. గాధ ఇంకా చాలావుంది" అని పాల్ మళ్ళీ ఒక సిగరెట్టు ముట్టించి తిరిగి ప్రారంభించాడు.

ఇది జరిగిన మర్నాడే పట్టణంలో ఒక ఎగ్జిబిషన్ చూట్టానికి వెళ్ళాలనుకున్నాం. ఉదయం 9 గంటలకే బయలుదేరాలని అనుకున్నాం కూడాను. మేం మకాం చేసిన హోటల్లో బయట హాల్లో నేను కూర్చొని వున్నాను. లోపల నాభార్య దుస్తులు మార్చుకుంటూవుంది. ఎంతసేపటికి బయటికిరాదు. టైమ్ 10 దాటింది. హోటల్లో జనమంతా బయటికివెళ్ళారు. నేను కూర్చున్న హాల్లోనే ఒకమూల మట్టుకి నలుగురు స్టూడెంట్సు వొక టేబిల్ చుట్టూ కూర్చొని, సిగరెట్లు కాలుస్తూ చీట్లపేక ఆడుతూ వున్నారు. నేను యింకో మూల బజారువైపున్న కిటికీ దగ్గర కూర్చొని నా భార్యకోసం యెదురు చూస్తున్నా. టైమ్ 11 కూడా కావొచ్చింది. ఆమె యింకా బయటకు రాలేదు. నాకు మరీ చిరాకు వేసింది. సిగరెట్టు మీద సిగరెట్టు కాల్చివేసాను. కాలం గడపటానికి టేబిల్ మీదవున్న పత్రికలన్నీ వొకదాం తరువాత ఒకటి చదివేసాను.

చివరకు 12 గంటలకు నా భార్య క్రొత్త డ్రస్‌లో టప్‌టప్‌గా, ఒక

చేత్తో సంచీ, రెండో చేత్తో గొడుగు పట్టుకొని బయటకు వచ్చింది. వస్తూనే స్టూడెంట్సు కూర్చునివున్న టేబిల్ వైపుగా నడిచింది. పడవేయాలనే పడ వేసిందనుకుంటాను. చేతులో వున్న గొడుగు దభేలున క్రింద పడవేసింది. స్టూడెంట్సు పేకాటలో లీనమైవున్నారు. వాళ్లు ఆమె వైపుకి చూడనైనా లేదు. ఆమె విసుక్కుంటూ నాదగ్గరికి వచ్చింది. ఆమె ప్రవర్తన నాకు అస హ్యము వేసింది.

"ఇప్పటికే టైమ్ చాలా అయింది, త్వరగా వెళ్లదాము. తీసుకోదలిస్తే రొట్టె యేమైనా తీసుకో"

ఆమెకు ఆకలి వేస్తున్నట్లుగానీ, రొట్టె తీసుకోవాలని గానీ వున్నట్టు లేదు.

"యీమూల కూర్చోలేను. కిటికీలోనుంచి చలిగాలి వేస్తుంది. అటు...... ఆమూలకు వెళ్లదాము రండీ" అని స్టూడెంట్సుకు దగ్గరలో వున్న మరో టేబిల్ దగ్గరకు లాక్కుంటూ ప్రక్కనున్న మరో కుర్చీని పడవేసింది. ఇంతగోల జరుగు తున్నా పేకాడుతున్న స్టూడెంట్సుకు కనిపించినట్లు లేదు. వాళ్ళు ముఖా లైన తిప్పిచూడలేదు. వాళ్లు చూడకుండా వుంటమే మంచి దనిపించింది నాకు.

"యేదైనా కావాలంటే త్వరగా తీసుకో వెళ్లదాము" అని మళ్లీ నాభార్యని హెచ్చరించాను, కాని ఆమె అస లాగొడవే మరిచి పోయినట్లు కనబడింది.

"వాళ్లకు బీర్ త్రాగటము, చీట్ల పేక ఆడటము, సిగిరెట్టుమీద సిగరెట్టు కాల్చటము తప్పమరో పని వున్నట్లు తోచదు" అని ఆమె పేకాడుతున్న స్టూడెంట్సునిగూర్చి బిగ్గరగా, వారికి వినబడేటట్లు నాతో చెప్పింది ఎలాగైనా సరే వాళ్లని తనవంక తిరిగేటట్లు చేయాలని ఆమె వుద్దేశము.

స్టూడెంట్సు మావంక కన్నెత్తైనా చూడలేదు. నా అవస్థ ముట్టుకు చెప్పటా నికి వీలులేదు. టేబిల్ మీద పత్రికతీసి చదువుతున్నట్లు ముఖానికి అడ్డం పెట్టు కున్నాను.

"చూడండి ! వాళ్ల హేట్సు యెంత ఛండాలంగా వున్నయో, వాళ్ళ డ్రస్ చూస్తే వోళ్లు మండుతుంది. అచ్చగా రైల్వే పోర్టర్లలాగా వున్నారు."

నేను వూ ! అనలేదు, ఆ ! అనలేదు. ముఖానికి అడ్డంగావున్న పత్రిక అలాగే వుండిపోయింది.

నా భార్య యింకా యేంటో అనబోయింది. వ్యవహారం ముదురుతుం దేమోనని మధ్యనే అందుకున్నాను.

"ఈ పట్టణం నీకు బాగా వుండకపోతే ఇక్కడే వుండాలని ఎవడేడ్చాడు? ప్రయాణంకట్టు. 2 గంటలకు ప్కిట్ర్సీకి రైలువుంది వెళ్లదాం" అని గద్దించి

పలికాము. నేను గట్టిగా మాట్లాడితే నా భార్య యెదురు చెప్పదని నాకు ధైర్యంవుంది. ప్రయాణానికి సిద్ధపడింది.

... ... ... ...

సాయంత్రం 4 గంటలకి మేము అక్కడకు చేరుకున్నాం. డ్రామా యాక్టరైన నా మిత్రుడు రిచర్ ఆహ్వానంపై మేము అతని యింట్లోనే మకాం చేశాము. ఆ యింటికి వొక ప్రక్క చెరువు, తోట, వొక ప్రక్క కొండ, దానికి అనుకునే వొక లోయ చూట్టానికి చాల రమ్యంగా కనపడ్డాయి. అక్కడ యెంత కాలంవున్నా రోజులు కులాసాగా గడిచేటట్లు కనబడ్డవి.

నేను షికారుకువెళ్ళి సాయంత్రం యింటికి చేరుకునే టప్పటికి నా భార్య తోటలో కూర్చుని చదువుకుంటూవుంది. ఇరవై గజాల దూరంలో, ప్రీస్టు అనుకున్నాను, కూర్చొని యేంటో వ్రాసుకుంటున్నాడు. యింకా కొంత దూరంలో నలుగురు మనుష్యు లెవరో కబుర్లు చెప్పుకుంటున్నారు. తోటలోని వారలు తీర్చినచెట్లు, పూలమొక్కలు, పిట్టల కీచుకీచు ధ్వనులు నాకు చాల హాయి నిచ్చాయి. సంతోషం పట్టలేక ఆమె దగ్గరికి వెళ్ళి యిలా అన్నాను.

"నాకు యీ వూరు చూట్టానికి చాలా బాగుంది. నీకు యెలావుంది."

"యీ వూరు పేరు వింటానికే నాకు అసహ్యం వేస్తుంది."

"ఈ చెరువో?"

"ఇది నా కంటికి ఆనలేదు. చాలా చిన్న చెరువు."

"మరి యీ కొండ, దాని ప్రక్కనున్న లోయ—."

"అవంటే నా కసలే సరిపడదు. డాక్టర్ని అడుగు." ఆమె అంతటితో ఆగలేదు.

"ఇచ్చటి భోజనం మంచిదికాదు. నీరు అసలే మంచిదికాదు. కాన్వెంటులో చేరితే యింతకన్నా సుఖంగా వుండేది. మీరు నిజంగా నన్ను ప్రేమించి నట్లయితే నన్ను యిక్కడకు తీసికొని వచ్చేవారు కాదు."

ఇంకా యేంటో నాకు వినబడకుండానే ఆమె తనలో తాను సణుక్కుంది.

"సరే! నీకు యిష్టం లేకపోతే రేపే బయలుదేరి వెళ్లుదాం" చెప్పాద్దు! నాకు చాలా కష్టంవేసింది. రోజు రోజుకూ ప్రయాణం, మూటా ముల్లె కట్టటం చూస్తే విసుగు పుట్టింది. చివరకు ఒక ఆలోచనతట్టి రిచర్ దగ్గరకు వెళ్ళాను.

"రిచర్! నాకు నీ సహాయం కావాలి. యీ వూళ్లో నీవు అందరినీ యెరిగే వుంటావు. ఆడదాన్ని చూడాలని తాపత్రయంపడే మగవాళ్లు—కనీసం తాపత్రయం పడుతున్నట్లు నటించే వాళ్లు యెవరైనవుంటే చెప్పు."

నా స్నేహితుడికి నేను చెప్పిన మాటలు అర్థంకాలేదు. అతడు ఆశ్చర్యములో నాకేసి చూసాడు. ఇక లాభంలేదని దాపరికం లేకుండా యదార్థం చెప్పాను. రిచర్ కి నా మీద సానుభూతి కలిగింది.

''జోసెఫ్ మంచి యాక్టరు. అభినయములో అతనికంటె ఇక్కడ మించినవాడు లేడు.''

''ఆడవాళ్ళకు మగవాళ్ళు అందముగా వున్నారా, లేదా అనేది పట్టదు. తాము అందముగా వుంటము, మగవాళ్ళు తమవంక చూట్టము వాళ్ళకు ప్రధానం.

... ... ... ...

మర్నాడు పొద్దున్నే నేను బయటికి వెళ్లాను. నా భార్య తోటలో కూర్చుని వుంది. జోసెఫ్ ఆమెను చూచినట్టూ, చూడనట్టూ నటిస్తూ దూరముగా పచారుచేస్తున్నాడు. నేను కొంత ఆలస్యముగా తిరిగి వచ్చాను.

''స్టేషనుదగ్గరకు వెళ్లి వస్తున్నా. రైలు 12 గంటలకి బయలుదేరుతుంది. ప్రయాణానికి సిద్ధముగా వుండు.''

''అప్పుడే అంత తొందరా! రాగానే వెంటనే తిరిగి బయలుదేరటము నాకు బాగా లేదు. ఇంకా రెండు రోజులుందాము. యీ చెరువు చూట్టానికి చాలా రమ్యముగా వుంది.''

''ఇది చాలా చిన్న చెరువు.''

''అలావుంటేనే నాకు యిష్టము.''

''మరి యీ కొండ లోయ...''

''కొండలంటే నాకు అమిత యిష్టము. యీ గాలి నాకు బాగాసరిపడింది. డాక్టర్లు సాధారణముగా యిలాంటి ప్రదేశాల్లో వుండాలని సలహా యిస్తారు కూడాను.''

మేము అక్కడ మూడు వారాలున్నాము. జోసెఫ్ ప్రతి ఆదివారంబిల్లు తెచ్చి యిచ్చేవాడు. అతని కిచ్చింది జీతము క్రింద 20 రూపాయలు టిపుకి రొట్టెకూ, 15 రూపాయలు.

పాల్ తన కథ ముగించాడు. మేమిద్దరము కుర్చీలమీద నుంచి లేచాము. హోటలు బయటికి వచ్చేటప్పుడు ''తిరిగి వచ్చే వేసవికాలములో అక్కడే మకాము చేయాలని తన భార్య అంటుందని'' పాల్ చెప్పాడు.

# లోకల్ పాలిటిక్సు

బెల్లింట్రా వొక చిన్న టవున్. సముద్రము వొడ్డున ఐర్లండులో యెక్కడో దూరంగా వున్నది. రాకపోక సౌకర్యాలు లేవు. దీనికి ప్రసిద్ధికెక్కిన టవున్ కూడా కాదు. అలాంటి ప్రదేశము చూట్టానికి, కొత్తగా వచ్చిన చీఫ్ సెక్రటరీ—విలేచీ వస్తున్నాడంటే అందరికీ ఆశ్చర్యము వేసింది. ఇదివరకు పనిచేసిన యే చీఫ్ సెక్రటరీ, కనీసం అతని క్రింద వుద్యోగస్తులు కూడా అక్కడికి వచ్చిన పాపాన పోలేదు. విలేచీదే మొదటిరాక.

చీఫ్ సెక్రటరీ వస్తాడని వినగానే టవున్‌లో సంచలనము కలిగింది. అతడు రావటానికి పెద్ద కారణము కూడా లేదు. యేదైనా పని చేయించుకోవాలని, దానివల్ల కాస్తో కూస్తో గిట్టించుకోవాలని కొంతమంది స్వలాభపరులు ప్లాను వేస్తున్నారు.

ఇంపీరియల్ హోటల్లో చీఫ్ సెక్రటరీ విషయము చర్చకు వచ్చింది. మైకేల్, హోటల్ ప్రొప్రయిటరు ధాడీతో సెక్రటరీ వస్తున్నాడని బహుశ కలోనెల్ బెరిస్‌ఫర్డు డిన్నరిస్తాడని, ఆ రాత్రికూడా అక్కడే వుంటాడని చెప్పాడు.

ఈమాట వినేటప్పటికి ధాడీకి కొంచెం కోపం రాసుకున్నట్లయినది. బెరిస్‌ఫర్డంటే అతనికి గిట్టదు. బెరిస్‌ఫర్డు వొక పెద్ద ల్యాండ్‌లార్డు.

'వచ్చేవాడూ వూరికేనే వచ్చి పోటము మంచిది. అక్కడా, యిక్కడా డిన్నరుకోసము రావటము బాగోలేదని' ధాడీ ముఖ మొర్రచేసుకొని చెప్పాడు.

ధాడీ అంటే టవున్‌లో కొంత విలువ వుంది. అతడు డిస్ట్రిక్టు అర్బన్ కౌన్సిల్లో చైర్‌మన్. లీగులోకల్ బ్రాంచికి అధ్యక్షుడు కూడాను. అతన్ని వ్యతిరేకించి టవున్‌లో యేదైనా జరగటము కష్టము.

'బెరిస్‌ఫర్డు గట్టిగా డిన్నరిస్తాడని నాకు తెలియదు. నేను వూరికినే అనుకుంటున్నాను. నీయిష్టమువచ్చినట్లు ఏర్పాటుచేయవచ్చునని, మైకేలన్నాడు.

'అంతే' నన్నట్లుగా ధాడీ తల వూపాడు.

చీఫ్ సెక్రటరీ ప్రోగ్రాము నిర్ణయించ బడ్డది. అతడు మోటారు మీద సరిగ్గా 12 గంటలకు బెల్లింట్రా రావటం. తరువాత వచ్చిన పని పూర్తి కాగానే వెంటనే తిరిగి పోవటము. మొట్టమొదటగా చీఫ్ సెక్రటరీని కాన్వెంటులోని యిండస్ట్రియల్ స్కూలుకి అధ్యక్షురాలుగావున్న రెవరెండ్ మదర్ ఆహ్వానించింది. సెక్రటరీ మోటారుకారు కాన్వెంటుదగ్గర ఆగి స్కూలు తనిఖీ చేయటము, తరువాత ప్రీస్టు హెన్‌ఘాన్‌తో పరిచయం చేయించటం-

యీవిధముగా ప్రోగ్రాము నిర్ణయించబడ్డది. యీ యేర్పాట్లు చర్చి అధారిటీలకు బాగానే వుంది. కాని తక్కినప్రజలు చీఫ్ సెక్రటరీవల్ల పొందేలాభము కనబడలేదు. కొంతమంది ధాడీని తక్కినవాళ్ళకూడా యేదోవొక విధముగా లాభము కలిగేటట్లు పని కల్పించాలన్నారు. ధాడీకిది అవసరముగా కనబడలేదు. అతనిమట్టుకి అతనికి చీఫ్ సెక్రటరీవల్ల పొందే లాభము కనబడలేదు. యిదివరకే టవుణ్ లో పెద్దపదవులు సంపాదించాడు.

డాక్టరు విట్టీ ఒక ప్లాను చూపాడు. యిది వెనుకటినుంచి అనుకోకపోయినా మొత్తానికి సమంజసముగానే వుంది. 'చీఫ్ సెక్రటరీ వచ్చినందుకు వూరికేనే పోనివ్వటము బాగాలేదు. సముద్రం వొడ్డున లోపలిదాకా వొక వార్ఫు కట్టించటానికి చీఫ్ సెక్రటరీని అడుగుదాము. దానివల్ల టవున్ కి మంచిలాభం' అని సలహా చెప్పాడు.

దీన్ని మైకేల్ బలపర్చాడు. మైకేల్ వృత్తిలో కంట్రాక్టరు. చీఫ్ సెక్రటరీ వార్ఫు కట్టించుకోటానికి అనుమతిస్తే కంట్రాక్టు తనకేవస్తుందనే దృఢ విశ్వాసము అతనికుంది. దానివల్ల మంచి లాభము కొట్టొచ్చు ననుకున్నాడు. అన్నీ లెక్క లేసుకొని కనీసము 200 పౌన్లు లాభము తీయవచ్చుననీ, యినస్పెక్టరు కాస్త లోపించేవాడైతే యింకాలాభము వస్తుందని అంచనా వేసుకున్నాడు.

మర్నాటి వుదయము మైకేల్ డాక్టరు గారియింటికి వెళ్ళాడు. వార్ఫువల్ల ప్రజలకెంతో లాభంవున్నదని వొకలెక్కను చెప్పాడు. "చేపలు పట్టటానికి, పడవలు ఆగటానికి చాలా యిబ్బందిగా వుంది. అనేక మంది చస్తున్నారు. దీనివల్ల కుటుంబాలు నష్టపడుతున్నై. వార్ఫువుంటే అనేకమంది ప్రాణాలు నిలుస్తవి. చేపలవ్యాపారము బాగా సాగుతుంది, ప్రజలు బాగా సంపాదించుకుంటా"రని లెక్కలు వేసి చెప్పాడు.

డాక్టరికి మైకేల్ మనఃప్రవృత్తి తెలుసు వార్ఫుకోసం మైకేల్ యెందుకు తహతహ పడుతున్నాడో కూడా తెలుసు. కాని డాక్టరుమట్టుకి వార్ఫువుంటే వ్యాపారం అభివృద్ధి చెందుతుందని, దానివల్ల టవుణ్, టవుణ్ లోని ప్రజలు కొంతబాగుపడడానికి అవకాశంవుందనే వుద్దేశములో వార్ఫు కట్టించాలంటున్నాడు.

'అయినా మనం అనుకున్నంత తేలిగ్గా వార్ఫు కట్టించటము కష్టము. ప్రభుత్వము యిప్పుడు యేపనైనా శాంక్షన్ చేసేముందు చాలా జాగ్రత్తగా ముందు వెనుకలు ఆలోచించి మరీ శాంక్షన్ చేస్తు అని డాక్టరుచెప్పాడు.

'అయితే యేమిచేద్దాము' అని మైకేలన్నాడు.

డాక్టరు కొంతసేపు ఆలోచించి 'మనం చీఫ్ సెక్రటరీ దగ్గరికి ఒక రాయబారం పంపాలి. ఆ రాయబారంలో చీఫ్ సెక్రటరీకి కాదనటానికీ వీల్లేని వాళ్లు వుండాలని' చెప్పాడు.

'అయితే నీవూ, నేనూ, ఫాదర్ హెనఘాన్...' అని మైకేల్ వరసగా లెక్కపెట్టటం ప్రారంభించాడు.

'నీవూ, నేనూ వుంటే ప్రయోజనము లేదు. ఇంకా పెద్దవాళ్ళు అవసరం. ఫాదర్ హెనఘాన్ కొంతవరకు పనికొస్తాడు. అతడు చీఫ్ సెక్రటరీ యిండస్ట్రియల్ స్కూలు తనిఖీచేసిన తరువాత రాయబారవర్గాన్ని చీఫ్ సెక్రటరీకి పరిచయము చేయటానికి రాయబార వర్గంలో తాను ఒకడినని చెప్పటం చాలా అవసరం.'

''మరి తక్కినవాళ్ళు, మిష్టర్ రెవరెండుజాక్సనుకూడా వుంటేమంచిదే.'

'జాక్సను ప్రాటెస్టెంటు మినిస్టరు. అతనికి వార్ఫుల గొడవ తెలియదు. అతని వల్ల ప్రయోజనం యేం'టని మైకేల్ ప్రశ్నించాడు.

'ప్రయోజనం చాలా వుంది. కాథలిక్ ఫాదర్ ప్రాటెస్టెంటు మినిస్టరు రాయభార వర్గంలో వుంటే చీఫ్ సెక్రటరీ దృష్టిలో మనలో మనకి మంచి ఐకమత్యం వున్నట్లు కనబడుతుంది. మనం యిలాంటి భావాన్ని కల్గిస్తే వార్ఫు యెదుట లైట్ హౌస్ కూడా కట్టించుకోవచ్చు.'

'మిష్టరు జాక్సన్ యిలాంటి కార్యంకోసం వస్తాడంటే నాకు నమ్మకం లేదు.'

'ఆ పని చాలా తేలిక. ఆ బాధ్యత నాది. కాని యింతకంటె మనం యెక్కువ శ్రమతీసుకోవలసింది యింకా వుంది. కలోనెల్ బెరిస్ ఫర్డుని హోటల్ ప్రొప్రైటరు ధాడీనికూడా యీ రాయబార వర్గంలో చేర్చాలి.

'ఇది మట్టుకి అసంభవం. ఆ యిద్దరినీ మనం ఒకచోటికి తీసుకురాలేము. కలోనెల్ వస్తే ధాడీ రాడు. ధాడీవస్తే కలోనెల్ రాడు.'

మనకి యిద్దరూ అవసరం. రాయబారవర్గంలో కలోనెల్ లేకపోతే చీఫ్ సెక్రటరీ యిదంతా హంబక్కు అనుకోవచ్చు. కలోనెల్ టవునులో పెద్ద ల్యాండ్ లార్డు. కాబట్టి అతడుంటం చాలా అవసరం.

'అయితే ధాడీ రాడు.,

'అతడుకూడా తప్పకుండా వుండేటట్లు చూడాలి. ధాడీ డిస్ట్రిక్టు కౌన్సిల్లో లోకల్ లీగ్‌లో హెడ్‌గా వుంటం చేత అతడు కూడా రాయబార వర్గంలో వుంటే చీఫ్ సెక్రటరీ యికలేదంటానికి వీల్లేదు. అదికూడా కాకుండా ఒకవేళ అతన్ని వుంచకపోతే అసలు వార్ఫుకట్టనీయకుండా చేస్తాడు. పదిమందిని పోగుచేసి సంతకాలు చేయించి వార్ఫుఅక్కర్లేదని మహజరు పిటీషను పెట్టి మన

కార్యాన్ని భంగంచేసే సత్తావుంది అతనిలో. కనుక యెలా చూచినా అతన్ని చేర్చటం మంచిది.'

'ఈ సమస్య చాలా గడ్డుగానే వుంది. పనికావాలంటే థాడీ కలోనెల్ యిద్దరూ తప్పనిసరిగా రాయ బారవర్గంలో వుండాలి. కానియిద్దరినీ ఒకచోట చేర్చటం ఒకపనికి పంపటం జరిగేది కాదు.

డాక్టరుకి వొకవుపాయం తట్టింది.

'మైకేల్ ! ఫాదర్ హెన్‌ఘాన్ని, రివరెండుజాక్సన్‌ని నేనుకలుసుకుని మాట్లాడుతాను. నీవు ముందు హోటలుకెళ్ళి థాడీని కలుసుకో. కలుసుకొని రాయబారంలోఅతనుకూడా వుండాలనీ, కలోనెల్ వుంటానికి వొప్పుకున్నాడనీ చెప్పు. తరువాత నాతో థాడీ యేమన్నాడో వచ్చిచెప్పు.'

మైకేల్‌కి యేం జరుగుతుందో తెలుసు. 'కలోనెల్ రాయబారంలో వున్నాడని చెప్పితే థాడీ వార్పు కాకుండా చేస్తానంటాడు. థాడీ యిదే చెప్పుతా' డని మైకేలన్నాడు.

'అదంతా నీకనవసరం. ముందు థాడీతో నే చెప్పినట్లుచెప్పు. తరువాత పని నేచూస్తాను.'

మైకేల్ థాడీతో డాక్టరు చెప్పినట్లు చెప్పాడు. అనుకున్నంతే జరిగింది. కలోనెల్‌కూడా రాయబారంలో వున్నాడని వినేటప్పటికి అతని వొళ్లు మండింది. ప్రజల మేలుకోసం చేసేపనిలో ల్యాండులార్డుని యెందుకు యిరికిస్తున్నారని అడిగాడు. యిలా చేసినందుకు డాక్టరుని ఫూల్ అన్నాడు. యీ విషయంఅంతా పేపరుకి పంపించి ఖండిస్తా నన్నాడు.

మైకేల్ తెల్లమొగం వేసికొనివచ్చి డాక్టరుతో జరిగిందంతా చెప్పాడు. డాక్టరు సంతోషించాడు.

''మంచిపనే జరిగింది. అసలు నేను థాడీ అలాగే అంటా డనుకున్నాను. నీవు రేపు మధ్యాంన 2 గంటలకొచ్చి నాతో మళ్ళీ కలుసుకో. యీ మధ్య నేను కలోనెల్ దగ్గర కెళ్లివస్తా. తరువాత నీవుమళ్లీ థాడీని కలుసుకొని యేంమాట్లాడాలో చెప్పుతాను.'

మైకేల్‌కి యిదంతా అగమ్యగోచరంగావుంది. డాక్టరు తనని ఫూల్ చేసి ఆడించటం లేదుగదా అనుకున్నాడు. 'సరే కలుసుకుంటాలే' అని యింటికి బయలుదేరాడు.

డాక్టరు అప్పటికప్పుడే సైకిల్‌మీద వెళ్ల కలోనెల్‌ని కలుసుకొని వార్పు విషయం చెప్పాడు. అతడు మొదట వొప్పుకోలేదు. 'తిని కూర్చోలేక యిలాంటి వెధవపనులకోసం తిరుగుతావా' అని డాక్టర్ని చెడాబడా

అన్నాడు. యిలాంటివాట్లో జోక్యం కలిగించుకోటానికి తనకు యిష్టం లేదన్నాడు.

డాక్టరు వూరుకోలేదు. యెత్తు పైయెత్తు వేశాడు.

'మీకు అసలీ విషయం తెలియదు. అది యిలా తెలిస్తే తోసెయ్యరు. థాడీ వార్ఫు కాకుండా చెయ్యటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. మీరుకూడా రాయబారవర్గంలో వుంటారని అతడికి తెలిసింది. అప్పటినుంచే మరీ కారాలు మిరియాలు నూరుతున్నాడు.'

'ఆ ఫూల్ కాకుండా చేస్తాడా? వాడికీ టవున్‌లో యేమిపలుకుబడుందో చూపిస్తా. వార్ఫుకోసము నేనే పూనుకుంటాను. వాడేమి చేస్తాడో చూస్తానని' కలోనెల్ అన్నాడు.

డాక్టరు యెత్తు పారిందనుకున్నాడు. యెల్లుండి మధ్యాహ్నం సరిగ్గా 12½ గంటలకు చీఫ్ సెక్రటరి మోటారులో కాన్వెంటు దగ్గరికి వస్తాడు. మీరు తప్పకుండా ఆ సమయానికి అక్కడుండాలి. రాయబార వర్గములో మీతో పాటు ఫాదర్ హెనఘాన్, రెవరెండు జాక్సనుగార్లు కూడా వుంటారు.'

థాడీ లేకుండా యెవరున్నా తనకిష్టమే నన్నట్లు కలోనెల్ తలవూపాడు.

డాక్టరు తక్కిన యిద్దర్ని కూడా కలుసుకొని రాయబార వర్గంలో వుంటానికి వొప్పించాడు.

* * * *

మరునాటి సాయంత్రం డాక్టరు సలహాతో మైకేల్ హోటల్లో కొచ్చాడు. హోటల్ ప్రొప్రైటరు థాడీ దగ్గరే కూర్చుని హస్కు ప్రారంభించాడు. మాటల్లో నెమ్మదిగా థాడీతో విషయం యెత్తాడు.

థాడీ! ప్రపంచంలో కొంతమంది ఫూల్సు తమకంటె గొప్పవాళ్ళు లేరనుకుంటారు. యేదైనా సహాయం చెయ్యాల్సివస్తే మావల్ల కాదంటారు.'

'అవును.'

'నిన్న మట్టుకి నిన్న యేం జరిగిందో చూడు. డాక్టరు కలోనెల్ దగ్గర కెళ్ళి రాయబార వర్గంలో వుండాలని, నీవు కూడా—'

'నేనుండనని యిదివరకే చెప్పానే.'

'అది సరే! నీవు కూడా వున్నావని చెప్పేటప్పటికీ 'ఆ స్కౌండ్రల్ వాడెందుకు' అని కళ్ళెర్ర చేసినాడట.'

'ఆఁ'

'ఇంకా చాలా నీచంగా నిన్ను గురించి అన్నాడని డాక్టరు చెప్పాడు. విసుగెత్తేవరకు నిన్ను తిట్టి చివరకి తను మట్టుకు రాయబారంలో వుండనని

నెమ్మదిగా జారుకున్నాడట. పైగా వార్డు అనవసరం అంటూ కూడా మాట్లాడాడని డాక్టరు చెప్పాడు.

'ఫూల్! వాడి పని పట్టిస్తా' నని ధాడీ కన్నెర్ర చేశాడు.

'మాటలంటే యేం లాభం. నీవు చేయాలనుకుంటే వుంది.'

'ఏంటి!'

'మనంతట మనం వార్డు కట్టించలేమని, అతని వలననే జరుగుతుందని కలోనెల్ చాలా తలబిరుసుగా మాట్లాడాడట. మనం యీ పని సాధించామా అతనికి పిచ్చెక్కుతుంది.—యేం లాభం. నీవు నుట్టుకి నీవు సంబంధం లేదంటంలా.. కలోనెల్ సవాలు చేస్తున్నా నీబోటివాళ్ళు దూరంగా వుంటే మేమేం చేస్తాము!

ధాడీ కాసేపు ఆలోచించాడు. కలోనెల్‌ను యేడ్పించాలంటే వార్డు కట్టించటం అవసరం అనుకున్నాడు. ముఖ్యంగా తనని తిట్టాడు కాబట్టి ధాడీకి రాయబారంలో తప్పకుండా వుండాలనిపించింది.

'సరే! డాక్టరుతో నేను తప్పకుండా రాయబార వర్గములో వుంటానని చెప్పు. చీఫ్ సెక్రటరీ ఒప్పుకోకపోయినా పార్లమెంటుదాకా వెళ్ళి యీ పని సాధిస్తాను. కలోనెల్ యేం చేస్తాడో చూస్తాను.

'రేపు మధ్యాహ్నం కాన్వెంటులో చీఫ్ సెక్రటరీ పని పూర్తిచేసుకోగానే వెంటనే మనం కలుసుకోవాలి. కనుక నీవు రేపు మధ్యాహ్నం సరిగా 12½ గంటలకు కాన్వెంటు దగ్గరకు రావాలి.'

'తప్పకుండా వస్తాను. డాక్టరుతో వస్తానని చెప్పు.'

... ... ... ...

మర్నాడు మధ్యాహ్నం చీఫ్ సెక్రటరీ భార్యాసమేతంగా టయింప్రకారం బెల్లింట్రూ వచ్చాడు. ఫాదర్ హెనఘూర్, రెవరెండు మదర్ వారిని ఆహ్వానించి కాన్వెంటు లోపలికి తీసుకెళ్ళారు. బయట చుట్టూ చాలా జనం చేరింది. డాక్టరు 12-నిమిషాలకు అక్కడ హాజరయ్యాడు. రెవరెండు జాక్సనుకూడా యింకో 5 నిమిషాలకు అక్కడకు చేరుకున్నాడు. మైకేల్, ధాడీ యిద్దరూ కలిసివచ్చి కాన్వెంటు గేటుప్రక్కనే నిలబడ్డారు. యింకా కొంచెం సేపట్లో కలోనెల్ బెరిస్‌ఫర్డు కూడా అక్కడ ప్రత్యక్షం అయ్యాడు.

డాక్టరు ధాడీ వెంట మైకేల్ వుంటం చూశాడు. కలోనెల్ రాకకూడా చూశాడు. అతడు వెంటనే కలోనెల్ ప్రక్కచేరి చెవులో నెమ్మదిగా చెప్పాడు.

'చూశారా? ధాడీ వచ్చాడు. మనకార్యం భగ్నం చేయటానికే వచ్చి

వుంటాడు. మనం జాగ్రత్తగా వుండాలి.'

రేం ఫరవాలేదులే అన్నట్లు కలోనెల్ మిలటరీపోజులో డాక్టరు వంక చూశాడు.

అటు డాక్టరు ప్లాను ప్రకారం మైకేల్ ధాడీ చెవులో 'చూశావా! కలోనెల్ వచ్చాడు' అని వూదాడు.

ధాడీ 'వాడేం చేస్తాడు. వెధవ అన్నట్లు,గా కలోనెల్ వంకచూశాడు.

సరిగ్గా 12-30 అయ్యేటప్పటికి చీఫ్ శెక్రటరీ కాన్వెంటు పని పూర్తిచేసుకొని బయటికి వచ్చాడు. కలోనెల్ జాక్సను. ధాడీ అతని దగ్గరకు చేరారు. ఫాదర్ హెన్‌ఘాన్ చీఫ్ శెక్రటరీకి వారిని పరిచయం చేసి రాయబారం సంగతి చెప్పటానికి ముందుకు వచ్చాడు.

''వీరు రెవరెండు జాక్సను. ప్రొటెస్టంటు మినిష్టరు, యోగ్యుడు. వీరంటే అందరికీ అభిమానం, గౌరవం వుంది. యిక్కడ యింకో విషయం కూడా మీకు చెప్పటం మంచిది. భిన్నభిన్న మతాలున్నా అందరూ యీటవులో కలిసి మెలిసి చాలా ఐక్యతతో వుంటారు.''

రెవరెండు జాక్సను చీఫ్ శెక్రటరీ షేక్ హాండు యిచ్చుకున్నారు. చుట్టూ వున్న జనం సంతోషించింది.

''వీరిపేరు మీరు యిదివరకే విని వుంటారు. వీరు కలోనెల్ బెరిస్‌ఫర్డు. టవున్‌లో పెద్ద ల్యాండులార్డు. మాకోర్కె సరియైయిందనటానికి వీరు మా రాయబారవర్గంలో వుంటమే మీకు రుజువు.''

జనం మళ్ళీ సంతోషాన్ని వెలిబుచ్చింది. డాక్టరు ధాడీముఖం పరీక్షిస్తున్నాడు. ధాడీ తన కవమానం జరిగినట్లుగా భావిస్తున్నాడు.

కలోనెల్ చీఫ్ శెక్రటరీ చేతులు వదిలాడు. వెంటనే ఫాదర్ హెనఘాన్ ''వీరు ముఖ్యంగా నాస్నేహితుడు. ధాడీ, ఇంపీరియల్ హోటల్ ప్రొప్రయిటరు. టవున్‌లో నాయకుడు. అర్బన్‌కౌన్సిల్లో చైర్‌మన్. లీగు బ్రాంచికి ప్రసిడెంటు.''

కలోనెల్ ముఖంలో మార్పు వచ్చింది. డాక్టరు అతని వంక చూడనట్టు నటించాడు.

''యీ రాయబారవర్గం మిమ్మల్ని వొకచిన్న విషయం కోరటానికి వచ్చింది. యీటవున్‌లో సముద్రం వొడ్డున వార్ఫు లేకపోవటం చేత చాలా అవస్థగా వుంది. యీ ప్రాంతాల్లో చేపల వ్యాపారం బాగావుంది. చేపలమీదే చాలా మంది జీవిస్తున్నారు.''

చీఫ్ సెక్రటరీ చాలాఇష్టంలో సమాధానం చెప్పాడు.

'ఐర్లండులో సంఘీభావం ఐక్యత లేదని నేను అనుకుంటూ వుండేవాణ్ణి. కానివివిధ మతాలు వర్గాలు కలిసి పోయినైఅని, ఐక్యత యేర్పడ్డదనిమిమ్మల్ని చూచి అనుకుంటున్నాను. దాన్ని మీరాయశాగ వర్గమే రుజువు చేస్తున్నది. యిలా ఐక్యతతో వుంటం చూస్తే నాకు చాలా ఆనందంగా వుంది. ఇక నుంచి ఐర్లండులో నూతన శకము ఆరంభం అయిందని చెప్పాలి...మీ కోర్కెను నేను తప్పకుండా నెరవేరుస్తాను. ప్రభుత్వము మీకు కావలసిన ధన సహాయం చేసే టట్లు చూస్తాను' అని చీఫ్ సెక్రటరీ మళ్ళీ అందరికీ షేక్ హాండిచ్చి భార్యతో వచ్చిన మోటారులో యెక్కి వెంటనే తిరిగి వెళ్లి పొయ్యాడు.

... ... ... ...

కలోనెల్ డాక్టరుతో 'నీవు నన్ను మోసము చేశావు. నీమాటమీద నమ్మకముతో నేను వచ్చా' నని అన్నాడు.

'నేకాదు. మైకేల్ మోసంచేశాడు. అతడు ధాడీ రావటములేదని నాతో గట్టిగా చెప్పా'డని డాక్టరు సమాధానము చెప్పాడు.

'అదుగో చూడు! ధాడీ మైకేల్ని దబాయిస్తున్నాడు. కొట్టుతున్నాడు కూడాను. మిమ్మల్ని మోసం చేసినట్లే ధాడీని కూడా మోసము చేసి తీసుకొచ్చి వుంటా'డని డాక్టరు దూరంగా కీచులాడుకుంటున్న ధాడీ మైకేల్లవంక చూపించాడు.

ధాడీ మైకేల్తో దెబ్బలాట్టం, ఫాదర్ హేనఘాన్ అడ్డము రావటము కలోనెల్ చూశాడు. ఆ వుషారులో తన సంగతి మర్చిపోయి వచ్చినబండిలో యెక్కి మళ్ళీ యింటికి వెళ్ళి పొయ్యాడు.

సాయంత్రం మైకేల్ డాక్టరింటికొచ్చి తన నలాంటి సందిగ్ధములో పెట్టినందుకు కంప్లయింటు చేశాడు.

'ధాడీ నా మీద విరుచుకపడ్డాడు. ఫాదర్ హేనఘాన్ లేకపోతే నన్ను నిలువున చంపేసేవాడు.'

'నీవు కంప్లయింటు చెయ్యటములో అర్థములేదు. నీవుదెబ్బలేమీ తగల్లేదు. వార్ని శాంతను చేయించుకున్నావు.'

ఇక ధాడీ నాతో మాట్లాడడు.'

'ఎందుకు మాట్లాడడు. నీకు కంట్రాక్టులో 200 పౌన్లు వస్తయ్యని తెలిస్తే చాలు. నీకంటే యింకో స్నేహితుడు లేడంటాడు. నీ కొచ్చేడబ్బు అతని హోటల్లో కాకుండా మరో హోటల్లో ఖర్చు పెట్టామని తెలిస్తే అతనికి నిద్ర పట్టదు.'

# కడుపు కక్కుర్తి

మూడురోజుల్నుంచి పాపం నిద్రాహారాలు లేవు. ఆజనం అలాగేరోడ్డు మీద కాళ్లీడ్చుకుంటూ నడుస్తుంది. ముందు మగవాళ్లు, వాళ్ల వెంట ఆడవాళ్లు తరువాత పిల్లలు నడుస్తున్నారు.

మిట్టమధ్యాహ్నం యెండబాగా తీక్షణంగా వుంది. పైన నెత్తి క్రింద కాళ్లు కాలి పోతున్నై. వాళ్లముఖాలు పీక్కుపోయినై. ఒంటినిండా యెర్రదుమ్ము కొట్టుకుంది.

'అమ్మా! పట్నాం యెప్పటికి చేరతాం?' అని ఒక కుర్రాడు పక్కనున్న తల్లి నడిగాడు.

'రేపుసాయంత్రానికి'

'యేమైనా దొరుకుతుందా?'

'యెవరు పెడతారు?'

తల్లి కళ్లల్లో నీరు క్రమ్మినై. ముందున్న ముసలాడు 'యింతకంటె చావటం మే'లని ఆతల్లివంక చూసాడు.

ఆముసలాడు నోరు మెదల్చే టప్పటికి అందరూ అతనివంక చూసారు. ఒకళ్ల ముఖం ఒకరు చూసుకున్నారు. పైకియేమీ మాట్లాడ లేకపోయారు.

దీనికి కారణం వుంది. ఆముసలాడి కూతురు చచ్చిపోయి పదిరోజులు కూడా కా లేదు. కొంతమంది సైనికులు ఆఅమ్మాయిని చావబాదారు. పాపం ఆఅమ్మాయి ఆదెబ్బలకి తట్టుకోలేక చచ్చిపోయింది. ఆఘోరకృత్యం చూసినప్పటినుంచి ముసలాడికి పిచ్చెత్తింది. యేవో పిచ్చికూతలు కూస్తూ వుండేవాడు. సోల్జరు మాటవింటే పళ్లు పటపట కొరికి వాణ్ణి చంపెయ్యాలంటూ వుండేవాడు.

నిజంగా ఆస్థితిలోవుంది ఆముసలా డొక్కడేకాదు. సోల్జర్లు యింకాచాలా మందిని అలాగే చంపేశారు. ఆజనంలోనే చాలామంది భార్యల్ని, భర్తల్ని, యింకా యితర బంధువుల్ని పోగొట్టుకున్నారు. సోల్జరంటే అందరికీ వల్లమాలిన ద్వేషం యేర్పడిపోయింది.

వాళ్లంతా అలాగే నడుస్తున్నారు. కాళ్లు యిసుకలో కూరుకు పోయినై. ఒంట్లో సత్తువలేదు. కష్టంమీద కాళ్లు లాక్కుంటూ అడుగులో అడుగు వేస్తున్నారు.

దూరంగా వాకమూల్గు వినబడింది. యెవరో ఆరుస్తున్నారని ఒక కుర్రాడు పైగ చేశాడు. యెవరూ నమ్మలేదు. ప్రపంచంలో యిక మిగిలింది వాళ్లేనని

వాళ్ల వుద్దేశం. ముందుకు సాగారు. అరుపు బాగా వినపడింది.

అందరూ పర్యాయించి చూశారు. గోడ్డుప్రక్కనే ఒక మానవశరీరము పడి వుంది. అందరూ చుట్టూ మూగడముతో అతని వొంటిమీద ముసురుకున్న యీగలు జుయ్ మంటూ పైకి లేచినై. వొళ్లంతా గాయాలతోనూ, రక్తముతోను నిండివుంది. రక్తాని కంటుకున్న యీగలు అలాగే అంటుకుపోయినై.

అతని స్థితి చూచేటప్పటికి వాళ్లు గ్రహించారు. అతనిలో ఓపికున్నంత కాలము సోల్జర్లు వాడిచేత తోమించుకున్నారు. చివరకు ఒంట్లో సత్తువ లేక పని చేయలేని పరిస్థితి కొచ్చేటప్పటికి బడిసెతో పొడిచి వాడి నాస్థితిలో ఒదిలిపెట్టి పొయ్యారు.

అతని స్థితి చూచి వాళ్లకి జాలి వేసింది. ఆడవాళ్ళు మళ్లీ యీగలు ముసరకుండా గుడ్డతో తోలారు. మగవాళ్లు నీళ్లు తెచ్చి గాయాలు కడగారు. ఆ బాధకి తట్టుకోలేక అతడు మరీ అరవటము ప్రారంభించాడు. అతన్నిఆలా ఒంటరిగా విడిచిపెట్టి వెళ్ళటానికి వాళ్లకి మనస్కరించలేదు. చుట్టూ నిర్మానుష్యము. అతనికి వాళ్ళుతప్ప మరోదిక్కు లేదు. ఒంటిమీద గుడ్డ కప్పి వాళ్లు అతన్ని మోసుకుపోతున్నారు.

ఆ జనములో వున్న ఆడవాళ్ల భర్తల్ని యిలాగే పని చేయించుకోటానికి సోల్జర్లు బలవంతముగా యెక్కడికో లాక్కెళ్లారు. వాళ్లగతి యేమయిందో వాళ్ళకి తెలియదు. మగవాళ్లు పళ్ళు పటపట కొరుకుతూ నడుస్తున్నారు. ఆ సమయములో సోల్జరెవడైనా కనబడితే వాడి దగ్గర తుపాకున్నా సరే పైన బడి గొంతు పిసికేద్దామన్నంత వుద్రేకములో వున్నారు.

పొద్దు వాలేటప్పటికి వారు వొక పాడుపడిన గుడి దగ్గరకి చేరుకున్నారు. కాసేపు అలుపు తీర్చుకొని మళ్ళీ బయలుదేరదామని ఆగారు. గాయాలుతగిలిన వాణ్ణి క్రిందదించారో లేదో అతడి ప్రాణము పోయింది. అసలు మధ్యలోనే యెక్కడో ప్రాణము పోయివుంటుంది.

పాపం వాళ్లేమి చేస్తారు? అంతా ఒక్క నిట్టూర్పు విడిచారు. ముసలాడికి తన కూతురు జ్ఞాపకము వచ్చి బావురు మని యేడ్వడము ప్రారంభించాడు. ఎవ్వరూ అతనివంక చూడలేదు. కొంతమందికి భర్తలు గుర్తువచ్చారు. కొంతమంది భార్యలు—కొడుకులు—కూతుళ్లు—యిల్లూ వాకిలీ—పొలము గుర్తుకు వచ్చినై. అందరు యెవరి మట్టికి వారు దుఃఖాన్ని దిగమ్రింగుతున్నారు. అందరి మనస్సులోనూ సోల్జరు, వాడు చేసే ఘోరకృత్యాలు కనబడుతున్నై. నిజంగా ఆసమయములో యెవడైనా కనబడితే పీక్కుతినేవాళ్లు.

వాళ్ళనుకున్నట్లే జరిగింది. దూరాన్నుంటంచేత దుమ్ములో బాగా కనబడ

టము లేదు. ముగ్గురు వ్యక్తులు వాళ్ల వెంట నడిచి వస్తున్నారు. వాళ్లు ముగ్గురూ సోల్జర్లే. మధ్యనున్న వాడి కాలికి దెబ్బ తగిలింది. తక్కిన యిద్దరి సహాయముతో నడుస్తున్నాడు.

కాలికి దెబ్బ తగిలిన సోల్జరు హఠాత్తుగా ఆగి 'సివిలియన్స్' అని భయముతో వ్రేలెట్టి చూపించాడు.

ఆమాట వినేటప్పటికి తక్కిన యిద్దరూ వులిక్కి పడ్డారు. అందులో ఒకడు 'యివ్వాళ్టితో మన బ్రతుకు ఆఖ'రని ఒక వేడి నిట్టూర్పు విడిచాడు.

ప్రజలు వాళ్ళని యే విధముగా చూస్తారో వాళ్ళకి తెలుసు కాని యేమి చేస్తారు? వెనక్కి తిరిగి పారిపోయే సత్తా లేదు. రెండు రోజుల్నుంచీ వాళ్లు కూడా నిద్రాహారాలు లేకుండా ఆ రోడ్డుమీద నడుస్తున్నారు. వాళ్ల పీకెలు యెండిపోయినై. నాలికతో పెదవులు తడుపుకుంటున్నారు.

"మెషిన్‌గన్ వుంటే బాగుండేది. వాళ్ళని తరిమేసే వాళ్ళము" అని అందులో ఒకడన్నాడు.

వాళ్లు ముగ్గురూ శత్రువు చేతిలో వోడిపోయి పారిపోయి వస్తున్నారు. వాళ్ల తుపాకులు శత్రువులు లాక్కొన్నారు.

"ఇంతికీ మనము సోల్జర్లు కావటం మన దురదృష్టం, నాఅనేవాడు లేడు. అటు శత్రువులూ, యిటు ప్రజలూ, అంతా మనల్ని చూస్తే ద్వేషించే వాళ్లే" నని కాలు విరిగిన సోల్జరన్నాడు.

... ... ... ...

గుడి దగ్గర చలికిలబడే జనములోనుంచి వొకడు వీళ్లని గుర్తు పట్టాడు. చూచీ చూట్టంతోనే 'సోల్జర్లు, సోల్జర్లు' అని తక్కిన వాళ్ళతో చెప్పాడు.

అందరి కళ్లూ ఒక్కసారి అటు తిరిగినై. మగవాళ్ళు రయ్యిమంటూ పరిగెత్తారు. సోల్జర్ల చుట్టూ చేరి వోపికున్నంత సేపూ ఇష్టంవచ్చినట్లు చేతులతో, కాళ్ళతో సోల్జర్లని వలగ బొడిచారు. సోల్జర్లు వాళ్ళని వాళ్ళు రక్షించుకునే స్థితిలో లేరు. ఒకడు నెత్తురు కక్కుతూ కింద పడ్డాడు. రెండోవాడు స్పృహ తప్పి బొక్కబోర్లగా పడ్డాడు. తలకాయి యిసుకలో కూరుకుపోయింది. కాలువిరిగిన సోల్జరు వాళ్ళ సందులో దూరి తలకాయి దాచుకోటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఆమగవాళ్ళు సోల్జర్లని అంతటితో విడిచిపెట్టలేదు. కాళ్ళు పట్టుకొని గుడి దగ్గరకి యీడ్చుకుంటూ వచ్చారు.

'తన్నండి-పొడవండి-చంపండి' అనే కేకలు వినపడుతున్నై.

'కాదు' వాళ్లని చంపి మాంసము ముక్కలు ముక్కలు చేసి తినా'లంటూ

దూరంగా కూర్చున్న ముసలాడు అరుస్తూ లేచాడు.

జనం కళ్లు అటుతిరిగినై. - 'నిజమే! భలే మాంసం. భలే మాంసం' అని అందరూ చంక లెగరేశారు.

నెత్తురుకక్కుతున్న సోల్జరు కొంచెము తెప్పరిల్లుకుని 'చంపండి' త్వరగా చంపండి' అని నెమ్మదిగా అన్నాడు.

'త్వరగా చంపము. ముక్కలు ముక్కలు చేస్తేకాని మాకసితీర' దంటూ జనంలో నుంచి ఒక కేక వచ్చింది. 'రంపము పెట్టి కోయండిరా' అని మరో కేక. 'ప్రజల గొంతులుకోసే వాళ్ళని యేమి చేసినా పాపములే'దని ముసలాడు అరిచాడు.

'వాళ్ళదగ్గర డబ్బుంటుంది. ముందు అది తీసుకో'మని ఒకడు సలహా యిచ్చాడు.

జేబులు తమిడి చూశారు, వాళ్ళ జేబుల్లో యేమీ కనబడలేదు. ఒకడిదగ్గర మట్టికి రెండు రాగినాణాలు దొరికినై. 'దొంగముండాకొడుకులు మేజోళ్ళలో దాస్తా'రని యింకొకడు సలహా చెప్పాడు.

వాళ్ల మేజోళ్లు, బూట్సు బలవంతముగా పట్టి చించారు. యేమీ దొరక లేదు. దొరకలేదని మగవాళ్లు మళ్లీ తన్నటము సాగించారు. ఆడవాళ్లు ముఖాన వుమ్మేసారు. పిల్లలు యిసుక తీసుకొని వాళ్ల నోట్లో, కళ్లల్లో, చెవుల్లో కొట్టారు. వాళ్ళని యేడ్పించటం అందరికీ వినోదంగా వుంది.

యికసోల్జర్ల అవస్త చెప్పనక్కరలేదు. నాలికలు పీక్కుపోతున్నై. తిండి లేక పొట్టలు డొక్కులైనయి. ప్రాణాలమీద తీపిచేతపారిపోయివచ్చారు. యింత దూరం, యిన్ని రోజులున్నంచి ఆయాసపడి నడిచారు. కాని ఫలితం? చివరికి గుక్కెడు నీళ్లైనా దొరికితే గొంతు తడుపుకొని తరువాత చద్దామనుకుంటు న్నారు. కాని వాళ్లకు మంచినీళ్లు అడగటానికి గుండెలు లేవు. అడిగినా ఆప్ర జలు యివ్వరన్న సంగతి వాళ్లకి తెలుసు.

... ... ...

ప్రజలకు సోల్జర్లంటే యెలాంటి అభిప్రాయం వుంటుందో వాళ్లకి తెలుసు. సోల్జర్లు దొరికితే ప్రజలు యేం చేస్తారో కూడ వాళ్లకి తెలుసు. కాని ప్రజలు వాళ్లంటే యెందుకు అలాద్వేషిస్తారో వాళ్లకి తెలియదు. వాళ్లుపడే బాధల్లో యితర్లనిపెట్టే బాధలు మరిచి పొయ్యారు. వాళ్ళకి తక్కిన ప్రపంచంతో పనిలేదు. యుద్ధరంగమే వాళ్ళకు సర్వప్రపంచం. కుటుంబం పెళ్ళాం, బిడ్డలూ, అనే ప్రసక్తి వాళ్ళకుండదు. యెదుట వాణ్ణి చంపటం, చంపలేక వెనక్కు తిరిగితే తన పైవాడి చేతుల్లో తాను చావటం తప్ప మరో విషయం

వాళ్ళకు తెలియదు.

యుద్ధరంగంలో వున్నప్పుడు కూడా వాళ్ళకి యింతదురవస్థ, భయంలేదు. యెప్పుడూ వాళ్ళ చేతుల్లో మెషిన్ తుపాకు లుంటవి. యిప్పుడో! వట్టిచేతుల్తో వున్నారు.

మళ్ళీ 'కొట్టండి, చంపండి' అనేకేకలు బయలుదేరినై. చివరకు ఒకసోల్జరు అడగలేక అడిగాడు—ముందు కాస్త దాహం తీర్చుకోటానికి నీళ్ళివ్వండి. తరువాత మీాయిష్టము వచ్చినట్లు చంపండి.'

'ఆఁ నీళ్ళు కావాలా?' ఒకడు పళ్ళుబిగించాడు. ముసలాడు 'నాకూతురు, నాకూతురు' అంటూ ఆ సోల్జరు ముఖాన కాలితో తన్నాడు.

కాలు ఇరిగిన సోల్జరు నాలికతో పెదవి తడుపుకుంటూ 'చంపండి, వెంటనే చంపండి. ముందుజన్మలో......'

అతడిమాట పూర్తి కాకముందే ముసలాడు అందుకొని 'యీా జన్మలో నీ యిష్టము వచ్చినట్లు ప్రజల్ని చంపావు. కావలసినంత దోచుకున్నావు. ముందు జన్మలో ఏం కోరుకుంటున్నావ్' అని అతనివంక క్రూరంగా చూశాడు.

"ఆఁ, యీా యుద్ధానికి కారణంమేమా? మేము యుద్ధం కావాలన్నామా? యీా యుద్ధంల్ల మావాళ్ళో పడిందేమిటీ?"

"పాపం! సోల్జరు వట్టి అమాయకులు."

"మాకమాండరు యేదిచెప్పితే అదిచేయటం మాపని.అతడే సర్వాధికారి"

"వాళ్ళమాటలు నమ్మొద్దు. సోల్జర్లంత కటికవాళ్ళు ప్రపంచంలో లేరు" అని దూరానున్న ఒక ఆడమనిషి అంది.

"యింగ్లలో మా తప్పేమీాలేదు. కమాండరు చంపమంటే మేము....."

ముసలాడు తుపుక్కున అతని ముఖంమీాద వుమ్మి వేశాడు.

సోల్జర్ల కళ్ళల్లో నీరుక్రమ్మింది. నాలిక పిడచకట్టుకుపోతున్నా దాహము యిచ్చేవాడు కనబడలేదు. వాళ్ళూ ఒకప్పుడు రైతులే. ఒకప్పుడు వాళ్ళుకూడా సోల్జర్లంటే ద్వేషించేవాళ్ళు, హీనంగా చూసేవాళ్ళుకూడాను. కడుపు కక్కుర్తి కోసం, జీవితం నిలుపుకోడానికి సైన్యంలోచేరారు. వాళ్ళ తల్లిదండ్రులు, పెళ్ళాం బిడ్డలు కూడా యీాజనం మోస్తరుగానే ప్రపంచంలో యెక్కడో పొట్టపట్టుకొని తిరుగుతున్నారు. వాళ్ళుకూడా యీాజనం మోస్తరుగా సోల్జర్లంటే ద్వేషిస్తూ వుండవచ్చు. పోకపేర కనబడ్డా గుర్తిస్తారో లేదో! గుర్తించినా ప్రపంచంఅంతా వీళ్ళని త్యజించినప్పుడు వాళ్ళుకూడ త్యజించరనే నమ్మకం యేంటి? యిక ప్రపంచంలో 'నా' అనుకోటానికి వాళ్ళకి వాళ్ళే - ఆ ముగ్గురే మిగిలారు.

'యుద్ధం ఎవరు కావాలంటారు? మాకూ తల్లిదండ్రు లున్నారు; పెళ్లాం బిడ్డలున్నారు. మావూళ్లో......'

ఒకముసలాడు (కూతురు చనిపోయిన ముసలాడుకాదు) వాళ్ల ముఖాలు పరీక్షిస్తున్నాడు. అతడు 'మీదేవూరని' ఆ కాలిరిగిన సోల్జరుని అడిగాడు.

'మేర్స్ పట్టణం'

'వాళ్లదో?'

'బిరో గ్రామం'

'సైన్యంలో చేరకముందు మీ రేంచేసేవాళ్లు?

'పొలంపని'

'అయితే' ముసలాడు కొంచెంసేపు ఆలోచించి 'మరి సైన్యంలో యెందుకు చేరా'రని మళ్లీ అడిగాడు.

"మాకు చేరాలనే కుతూహలంలేదు. యింటిదగ్గర పొట్టగడవక......"

అందరూ నిశ్శబ్దముగా వింటున్నారు. వాళ్ళు పొలాల్లో పనిచేసేవాళ్ల మనేటప్పటికి అందరికీ ఆశ్చర్యమేసింది. అంతవరకూ సోల్జర్లంటే మానవలోకానికి సంబంధించినవాళ్ళు కాదని అనుకుంటున్నారు. రైతుల్లాగా, కూలీల్లాగా సోల్జర్లుకూడా మానవులేనా అనే సందేహములోపడ్డారు. "అయితే మీకు పొట్టకులేదని మనుష్యుల్ని చంపుతారా?" అని ఒక ఆడమనిషి అడిగింది.

"మావూళ్లో కూడులేక అందరూ చస్తున్నారు. మేము ఎట్లాగైన బతకాలనుకున్నాము.— మరి మా బతుకు తెరువుకోసం......"

"ప్రపంచములో బతకటానికి చాలా అవకాశాలున్నై. కాని అవన్నీ కొంతమంది చేతుల్లో వున్న" వని రెండో సోల్జరన్నాడు.

వాళ్లు ఎలాగైనా బ్రతకాలనుకున్నారు. ప్రాణాలమీద యెవరికైనా తీపేగా. సైన్యములోచేరితే ఒకటి రెండు సంవత్సరాల్లో యుద్ధము పూర్తిఅవుతుందనీ, తరువాత పింఛనువస్తే జీవితంఅంతా హాయిగా గడుస్తుందనీ అనుకున్నారు. కాని కమాండరు చెప్పినట్టు శత్రువులను చంపేరు. ఆశత్రువులెవరో వాళ్ళకి తెలియదు. అసలెందుకు యుద్ధం చేస్తున్నారో కూడా వాళ్ళకి తెలియదు. వాళ్ళ కమాండరుకు, అవతల కమాండరుకు బహుశ దేనిమీదైనా పోట్లాట జరిగివుంటుంది. ప్రజలు వాళ్లని చూస్తే ద్వేషిస్తున్నారు. కాని వాళ్ళకు ప్రజలంటే ద్వేషంలేదు. వాళ్లు యుద్ధములో వోడి పారిపోయి వస్తున్నారు.

"మేము ప్రాణాలమీద తీపిచేత యుద్ధంలోచేరాము. ఆతీపివల్లే మళ్లీ పారిపోయి వస్తున్నాము. కాని యిక్కడకూడా బ్రతికే మార్గము కనబడలేదు. యేమిచేస్తాము? చంపండి" అని కాలువిరిగిన సోల్జరన్నాడు.

అందరూ వొకరి మొఖం వొకరు చూచుకున్నారు. ఇంతకు క్రితంవరకూ సోల్జర్లంటే ఎక్కడాలేని ద్వేషముతో వున్నారు. కాని యీ సోల్జర్లుకూడా వాళ్ళమాదిరిగానే పొలములో పనిచేశారు. వాళ్ళమాదిరిగానే పల్లెటూళ్లో బ్రతికినవాళ్లే. మరి వాళ్ళను చంపటములో వుద్దేశము కనబడదు.

... ... ... ...

కాలుకు దెబ్బతగిలిన సోల్జరుకి బాధయెక్కువైంది. అదివరకే దెబ్బతింటం, తరువాత యీజనము చేతిలో మళ్లీ దెబ్బలు తింటము చేత అతడు భరించలేక పోయాడు. కాలు పట్టుకొని మూల్గటము ప్రారంభించాడు.

జనం అతనిచుట్టూ చేరింది. ఒకడు అతని కాలుకట్టు విప్పటం ప్రారంభించాడు. కట్టుగుడ్డ వుండుకి అతుక్కుపోవటంచేత వూడటంలేదు. సోల్జరు ఆ బాధకి మరీఅరవటం ప్రారంభించాడు.

"కొంచెం నీళ్లతో తడిపితే వూడుతుందని' వొక ఆడమనిషి అంది. నీళ్లు అనగానే సోల్జర్ల కళ్లు అటుతిరిగినై. కానిఅడగటానికి వాళ్లకు భయంవేసింది.

ఆ జనంలో వొకడు వాళ్లబాధ గ్రహించాడు. కూజాతో నీళ్లు తెచ్చియిచ్చాడు. ముగ్గురూ బహుఆత్రంతో కడుపు నిండా నీరు త్రాగారు. ఒకడు సోల్జరు వుండుకి కట్టిన గుడ్డ తడిపి నెమ్మదిగా వూడదీసాడు.

అందరూ సోల్జర్లకు సహాయము చేయాలనుకుంటున్నారు. కాని బయటికి యెవరూ వెళ్లబెట్టటములేదు. ద్వేషము స్నేహముగా మారింది. 'వాళ్లవీ మనలాంటి ప్రాణాలే. వాళ్లు చస్తుంటే మనము చూస్తూ వూరుకుంటామా?' అని యెవరిమట్టుకు వారు మనస్సులో అనుకున్నారు.

... ... ... ...

దెబ్బతగిలిన సోల్జరు యెక్కువసేపు కూర్చోలేక పొయ్యాడు. నెమ్మదిగా పక్కకి వరిగాడు. ప్రక్కనున్న కుర్రాడు అతని తల క్రింద పడకుండా పట్టుకొని తన తొడమీద పెట్టుకున్నాడు.

అతని బాధ మరీ యెక్కువైంది. వుండు బాధ. పైగా దెబ్బలవల్ల వొళ్లు పులకచేసి జ్వరముకూడా వచ్చింది. వోర్చుకోలేని స్థితిలో వున్నాడు. 'నన్ను చంపండి—వెంటనే చంపి పుణ్యము కట్టుకోండి—యీ బాధ భరించలే'నని అతడు యేడ్వటము ప్రారంభించాడు.

చుట్టు కూర్చున్న జనం కళ్లల్లో నీరు క్రమ్మింది. జాలిగా అతని వంక చూస్తున్నారు. శ్వాస బహు కష్టముతో పీలుస్తున్నాడు. అందరు ఆతురతతో చూస్తున్నారు. ఒక గంటసేపు వరకూ అతడు ఆ బాధ భరించలేక—భరించలేక చివరకి ప్రాణాలు విడిచాడు.

అందరూ దుఃఖములో మునిగారు. కొందరు రోడ్డు పక్కన యిసుకలో గుంట చేసి అందులో ఆ సోల్జర్ని పడుకోబెట్టారు. ఒక సోల్జరు "ఇదుగో! నీవు అడిగినా లేక నిమీ ముసలితల్లి కోసము ఆట్టి పెట్టాను. నీదగ్గరే వుంచుకో. ఆమెకెలాగో సమాధానము చెప్పతా" నని తన జేబులో వున్న రెండు కానులు అతని జేబులో పెట్టాడు. చుట్టూ వున్నవాళ్లు ఆ గుంట పూడ్చారు.

కూతురు చనిపోయిన ముసలాడు 'మనమంతా ఒకేస్థితిలో నే వున్నాములే' అని వేదాంతము ప్రారంభించాడు.

ప్రక్కనున్న సోల్జరు 'దీనికి కారణము మన తెలివి తక్కువే' నని సమాధానము చెప్పాడు.

అతడన్నది అందరికీ అర్థమయింది. కాని యెవరూ యేమీ మాట్లాడలేదు.

ప్రొద్దు బాగా వాలింది. ముందు రోడ్డు అంతులేకుండా వుంది. అందరూ మళ్లా ప్రయాణము కట్టారు. తక్కిన యిద్దరు సోల్జర్లు కూడా వాళ్లల్లో కలిసిపోయ్యారు.

# ఆడవాళ్లు నేనంటే పడిచస్తారు

"ఆడవాళ్లు నేనంటే పడిచస్తారు" తనతోపాటు గాయాలు తగిలి బాధపడుతున్న తోటిసైనికులతో చెప్పాడు ఆ యువక సైనికుడు. అతను చాలా అందంగా వుంటాడు. ఆ హాస్పటల్ లో అతనితోపాటు యింకా ముగ్గురు సైనికులున్నారు. వాళ్ళంతా గడ్డిపరుపులు వేసిన మంచాలమీద పండుకొన్నారు. ఇద్దరు ఏమీ తోచకుండా యింటికప్పువంక చూస్తూ పండుకున్నారు. మూడోవాడు ఒక మూల నిండా ముసుగు పెట్టుకొని పండుకున్నాడు. అతను చలికి గడ్డకట్టుకు పోయినట్లున్నాడు. అవి చలిరోజులు. దూరంగా రైలు స్టేషన్ వుంది. స్టేషన్ పైనించీ రైలుయింజన్ పొగలు పైకిలేచి మేఘాల్లాగా కనపడుతున్నాయి. కాకులు గుంపులు గుంపులుగా ఎగురుతున్నాయి. ఎర్రగుర్తు వేసిన గూడ్సు పెట్టెలు చాలా వున్నాయి స్టేషన్ ముందు.

గాయాలు తగిలిన సైనికులు చాలా విసుగ్గా, మత్తుగా వున్నారు. అయినప్పటికి యుద్ధరంగానికి వెళ్లాలనే ఆతురత వాళ్ళలో ఎవరికీలేదు. వెళ్లిందగ్గర నించీ కందకాలు తవ్వాలి, సైన్యాధిపతి మాటలు వినాలి, శత్రువుల గుండు దెబ్బల్ని తట్టుకోవాలి, యిన్ని చెయ్యాలి. వాళ్ళలో ఒకడు కీళ్ళనొప్పులతో బాధ పడుతున్నాడు. ఇంకొకడు కాళ్ళమీదున్న పుళ్లు నయంచేయించు

కొంటున్నాడు. నిండా ముసుగు పెట్టుకొని పండుకున్నవాడు అప్పుడే పైఫాయిడ్ నించి కోలుకొంటున్నాడు. అందంగావుండే ఆ యువక సైనికుడు ఏదో సుఖరోగంతో బాధపడుతున్నాడు. "ఆడవాళ్లు నేనంటే పడిచస్తారు" అన్నాడు అతను. "నేను అబద్ధా లాడుతున్నా ననుకొన్నావా ? దేవుడు సాక్షి నిజం చెబుతున్నా. మరి నేనంటే వాళ్లు ఎందుకు పడిచస్తారో ఆభగవంతుడికే తెలియాలి. ఆడవాళ్ళను ఎట్లా పట్టాలోమాత్రం నాకు బాగా తెలుసు. అసలు కిటుకు ఏమిటంటే ఆడవాళ్ళని ఎప్పుడు చులకన చెయ్యకూడదు. వాళ్ళతో ఏట్లా ప్రవర్తించాలో ముందు నేర్చుకోవాలి. అదీ అసలు కిటుకు. కొందరు స్త్రీలు, వాళ్ళని పురుషులు తేలిగ్గా చూస్తుంటేనే గౌరవిస్తారు. కాని అందరు ఆడవాళ్లుమాత్రం అట్లాకాదు. బాగా బతికే ఆడదానితో కొంచెము మర్యాదగా వుండాలి. నువ్వు చెప్పిందానికి ఆమె ఔనని తలూపితే ఆమె చెప్పిందానికి నువ్వుగూడా తలూపాలి. నువ్వు చెప్పిందానికి ఆమె కాదన్నప్పుడు నువ్వూ కాదనాలి. ఈ దేవరహస్యం అర్థం చేసుకోవాలి. ఒకప్పుడు నేను కెప్టెన్ వీరెన్ తో కలిసి పనిచేశాను. అతను చాలా స్వతంత్రజీవి. అతనింట్లో ఒక గుంట పనిచేస్తుండేది. అది మంచి యవ్వనంలో వుండేది. చాలా అందంగా పరిశుభ్రంగా గూడా వుండేది గుంట. మర్యాదలు గూడా బాగా తెలుసు. మొదట్లో దాన్ని తేలికచేసి వశపరచుకోవాలని చూశాను. కాని ఆ పప్పులు వుడకలా. ఇక తర్వాత ప్లేటు మార్చేశా. అది ఔనంటే ఔనని కాదంటే కాదనీ మొదలుపెట్టా. ఇక్కడికి అక్కడికి దానివెంట వెళ్ళేవాణ్ణి. అది సినిమాకిపోతే నేనూ పోయేవాణ్ణి. అప్పుడప్పుడు దానికి తీపిసరుకులు గూడా కొనిపెడుతూ వుండేవాణ్ణి. నా ప్లాను పారింది. నేను ప్రతి రాత్రి దాని దగ్గరకి వెళ్ళేవాణ్ణి...కొంతకాలానికి ఆ గుంట అంటేనే విసుగెత్తింది. 'అదీ సంగతి. ఆడవాళ్ళు నేనంటే పడిచస్తారు......ప్రతివాళ్ళూ అదే అంటారు."

చిన్న డాక్టరు థర్మామీటరు చేత్తోపుచ్చుకొని గదిలోకి వచ్చాడు. "ఆ అరే! అబ్బాయి అప్పుడే మొదలుపెట్టా కోతలు, ఆడవాళ్ళు నువ్వంటే పడిచస్తారనీ, అదనీ, యిదనీ. కొయ్యి కొయ్యిరా అబ్బాయి, నీయిష్టం వచ్చినన్ని కోతలు కోసెయ్యి !! కళ్ళు ఓరగాపెట్టి చూస్తూ అన్నాడు చిన్న డాక్టరు.

"అందుకనేరా నాయనా, నీకు వాళ్ళు తగిన బహుమతి అందిచ్చారు."

"వీళ్ళ దుంపతెగ ఆడవాళ్ళు. వీళ్ళకు ఏదేవుడి శాపం తగులుతుందోగాని వీళ్ళే నా జీవితాన్ని నిజంగా నాశనం చేశారు" అన్నాడు యువక సైనికుడు.

చిన్న డాక్టరు ముసుగు పెట్టుకొని పండుకొన్న సైనికుణ్ణి కదిలించాడు.

"లేరా అబ్బాయి, టెంపరేచర్ చూడాలి. అరే, వొణికి పోతున్నావే! చచ్చాం. టెంపరేచర్ కనీసం 40 డిగ్రీలన్నా చూపిస్తుందా?"

"నాకు ఏదన్నా కొంత తాగాలని వుందండీ" మూలుగుతూ చెప్పాడు ముసుగులోనించీ.

"ఇదుగో, థర్మామీటరు. చెయ్యి పైకిలేపి చంకలో పెట్టుకో. ఊఁ! అట్లా"

అప్పటికే చీకటి పడ్డది. చిన్న డాక్టరు బైటకుపోయి ఒక కప్పు, ఒకదీపం పుచ్చుకోని, మళ్ళీ లోపలకు వచ్చాడు. దీపం గూట్లో పెట్టాడు.

"బాధ ఎక్కువగా వుందా?" అడిగాడు చిన్న డాక్టరు.

"అవును."

"పెద్ద డాక్టరుగారితో చెప్పి వస్తాను" ఒక్క అరగంట గడిచింది. కీళ్ళ నొప్పుల్తో బాధపడే సైనికుడు కాళ్ళు పిసుక్కుంటున్నాడు. దోమలు తెగ కుడుతున్నయిఅతన్ని. అందుకనే మధ్య మధ్య గోక్కుంటున్నాడు.

"పీటికడుపుమాడ. మళ్లీ పాడుస్తున్నయి. మిస్సర్ రాజధాని అంటే నాకు అందుకనేమంట. ఈ రాజధానిలో దోమలు లేని కొంపలేదు." అతను నెమ్మదిగా లేచి అగ్గిపుల్లగీసి గోడకు అంటించడము సాగించాడు.

"దోమల్ని కాలవటము మొదలుపెట్టా మళ్లీ" అన్నాడు కురుపుల్తో బాధ పడుతున్న సైనికుడు.

"అవును. కాలుస్తున్నా. వాటిని మాడ్చి మసి చేస్తా. నా జీవితాన్ని దుర్భరము చేస్తున్నయి అవి."

"అరే, ఏంలేదు. కొంచెము జాగర్త. కొంప కాల్చేవు"

"ఏం ఫరవాలా."

చాలాసేపు నిశ్శబ్దము నడిచింది.

"అదీ అసలుసంగతి. ఆడవాళ్ళు నేనంటే పడిచస్తారు" అంటూ మళ్ళీ మొదలు పెట్టాడు యువక సైనికుడు.

"వాళ్ళు నన్నెందుకు ప్రేమిస్తున్నారన్నది నాకే తెలీదు. నాతో యింత వరకు ఆవిషయములో పోటీకి నిలిచిన మొనగాడే లేడు. దైవసాక్షి. ఇదంతా నిజమే. నిరుడు సంవత్సరము నేను శెలవుమీద వున్నా నా, అప్పుడల్లా ఆడ వాళ్ళను వొదిలించుకుందామంటే వొదిలించుకోలేకపోయాను. మళ్ళీ అందరూ గూడా మిలటరీవాళ్ళ పెళ్లాలే. చెబితే మీరు నమ్మరు సుమా!"

"అవును. మిలటరీవాళ్ళ పెళ్ళాల విషయములో మాత్రం అది నిజమే. మీరెవ్వరూ నమ్మనిమాటా నిజమే. కాని మనందరికీ తెలిసిందే. భర్తలు యింటి

దగ్గర వుండరుగాదూ?'' ఒక్కొక్క దోమనే చంపుతూ అన్నాడు దోమల్ని చంపే సైనికుడు.

''అవునురా అబ్బాయి, వాళ్ళకేమిభయంగనక! భర్తా, చాలామూరాన కందకాల్లోవున్నాడు. ఆడదానికి మొగాడు లేకుండా బతకటము చాలాకష్టము. అవునా. నాపెళ్ళామే నన్నట్లా మోసం చేస్తుందని తెలిస్తేనా దాని చర్మాలు వొలుస్తా. చంపేశానన్నమాటే యింకెందుకూ'' కురుపులతో బాధపడుతున్న సైనికుడు కళ్ళు ఎర్రజేసి అన్నాడు.

''అవును అట్లాగే అంటావు కాని నువ్వేందుకు చేస్తావు.'' అంటూ యువక సైనికుడు అందుకున్నాడు. ''ఊఁ యిందాక నేచెపుతున్నానే ఆవిషయము. సరేనా; శెలవలికి యింటికెళ్ళాను. ప్రతివాడూ నాకు సలాం గొట్టడము సాగించాడు. భలే హుషారుగా గడిచిపోయిందిలే కాలము. ఆడవాళ్ళకోసం వీధులవెంట పట్టం నాకు ఎప్పుడూ గిట్టదు. నాకు అట్లాంటి ఆడవాళ్ళంటే మనస్సుపోదు. మంచి యవ్వనములో బాణంలా గావుంటే అమ్మాయంటే నాకు భలే యిష్టము. మావూళ్లో బస్సు దిగుతామే ఆరోడ్డు చివర్లో అటునించి మూడో యిల్లు ఒకటి వుంది. అక్కడ ఒక అమ్మాయి కాపరము చేస్తోంది. చాలా బావుంటుందిలే! సైనికుడి పెళ్లాము. ఆ అమ్మాయిపేరు డాషా. చాలా అందమైన అమ్మాయి. ఇక చూడు. ఆ అమ్మాయిమీద నా మనస్సు కట్లు తెంచుకొని పోయింది. ఆ అమ్మాయి కావాలని చాలా తంటాలు పడ్డా. నేను ఏంచెప్పినా వినేదే కాదు. చెవులు, కిటికీలు మూసుకొనేది. మొదట్లో జబర్దస్తీ చేసి వశపరచుకుందామని చూశా. లాభము కనిపించలా. నేను మర్యాదగల పద్ధతి కూడా అవలంబించి చూశా. అదీ పారలేదు. చాలా గడుగ్గాయిరా బాబూ అనుకున్నా. మరతుపాకీదళానికి చెందిన సైనికుణ్ణి నన్నే లక్ష్యంచెయ్యలా. నానా రకాల తిప్పలుబడి చూశా. ఏమాత్రం బేరం పడలేదు. ఆమెతోపాటు నేనూ షికారు వెళ్లేవాణ్ణి రోజూ. 'ఇవ్వాళ రాత్రికి నీదగ్గరికి వస్తా' అనేవాణ్ణి. ఇక అక్కడే కూలబడి పోయేది. ఒక్క నవ్వనా నవ్వేదా? అబ్బే;

• చూడు మరి. అట్లాంటి నిప్పులాంటి ఆ అమ్మాయి ఒకరోజున తనంతట తానేవచ్చింది నాదగ్గరకు.

''ఇక నేను భరించలేను. నా భర్తలేకుండా యిక ఒక్క నిమిషం వుండలేను'' అంటూ బావురుమని ఏడ్చింది.

ఆమె తన భర్తను కలుసుకొని అప్పటికి రెండు సంవత్సరాలైందట. నేను దామను మెత్తగా ముద్దు పెట్టుకొని, నా చేతుల్లోకి ఆమెను తీసుకొని, కౌగ

లించుకొని సరే, యికదంతా చేశాననుకో. శలవు కాలమంతా గూడా ఆమెను నా భార్యలాగా అనుభవించాను. ఆమెను చూస్తానికి సాయంత్రం వెళ్లేవాణ్ణి. నా కాళ్ల బూడ్సులు ఆమే విప్పదీసేది. ఆమె శరీరమంతా వొణికి వొంపులు తిరుగుతుండేది. చాలా బావుండేదిలే. నేను ఎక్కడికి వెళ్తే అక్కడికి నా నీడలాగా వచ్చేది. ఎంత నెమ్మదిగా వుండేదనుకున్నావు; చాలా అందగత్తె. అన్నిటికంటె విశేషమేమిటంటే యింకో కుర్రవెధవ ఎవడు వెళ్లినా మూతి చూచేది కాదు. కాని నాకు మాత్రము ఎదురు చెప్పేదికాదు. ఆడవాళ్లు నేనంటే పడిచస్తారు. అబద్ధం కాదుసుమా!

“నీది ఏజిల్లానయ్యా?” కాళ్లకు కురుపులున్న సైనికుడు అనుమానంగా అడిగాడు.

“అనన్‌మీవ్‌స్కీ జిల్లా. మనిద్దరిది ఒక జిల్లా కాదుగదా ఖర్మంగాలి”

“కాదు. మాది టావ్‌రిచెస్కీ జిల్లా”

“ఉహుఁ! సరే! అది చాలా అందంగా నాజూగ్గా వుండేదిలే. ఇంతెందుకు జిలేబిలాగా వుంటుందనుకో ఆబిడ్ని గురించి ఊహించుకొంటే నే......”

మధ్య కొంత నిశ్శబ్దము నడిచింది.

“మీది ఏవూరయ్యా” ముసుగుకింద వున్న సైనికుడు బద్ధకంగా, హీన స్వరంలో అడిగాడు.

“మాది నికోల్యేవ్‌కా గ్రామం. అనన్‌యేవ్‌స్కీ-జిల్లా. మనమిద్దరము ఒక వూరివాళ్ళము కాదుగదా ఖర్మము గాలి.”

“అవును. ఒక వూరివాళ్ళమే. మాదీ అగ్రామమే” అన్నాడు ముసుగు పెట్టుకొన్న సైనికుడు.

“ఓః! అంటే నీకు డాషా తెలుసన్నమాట. సైనికిడి పెళ్ళాం?” శరీరం మీద పోస్తున్న చెమటను వూడ్చుకొంటూ అన్నాడు, యువకసైనికుడు.

“ఆమె నాకు తెలుసు. ఆబిడ నా భార్య. నా భార్యా, కనక మనమిద్దరం ఒక గ్రామస్థులమేనన్నమాట” నెమ్మదిగా వచ్చింది హీనస్వరం.

పదిమైళ్ళ దూరాన కాల్చిన తుపాకీ గూడా వాళ్ళకు వినిపించింది. చుట్టూ అంతా నిశ్శబ్దముగా వుంది. పుళ్ళతో బాధపడుతున్న సైనికుడు దగ్గాడు.

“అబ్బ. నాకు తాగటానికి ఏమన్నా వుంటేనా...” అని మూలిగాడు ముసుగుకింది సైనికుడు. మళ్ళీ తను ముద్దగట్టుకుపోతున్నట్లు అనిపించింది. అతనికి చేలి ఎక్కువైంది. చాలా అసౌకర్యంగా వున్నట్లు తోచింది. అతనికి ఏమీ కనపడకుండా, వినపడకుండావుంటే, ఆఖరికి అతని కళ్ళల్లోనూ నుదుటి మీదా మండిపోతున్న జ్వరము గూడా తెలియకుండా వుంటే బాగుంటుం

దనిపించి. అతనికి అసలు యుద్ధముగాని, ఆ హాస్పటల్ గాని, అందులోని ఆ సుఖరోగాల అందమైన యువక సైనికుడుగాని ఎవరూ, ఏదీ లేనట్లు అనిపించింది' తను తనకొంపలో విలాసంగా తనభార్యను కౌగలించుకు పడుకున్నట్లు అనిపించింది. మిగతాదంతా ఏదోపీడకల అనిపించింది.

# ముసలాడి చావు

## సాయంత్రం 6 గంటలు

తండ్రి బొత్తిగా ముసలాడు. జబ్బు స్థితిలో బాధపడుతూ చాలా ప్రమాదావస్థలో వున్నాడు. మంచంమీద మూల్గుతూ, ముసుగులో తెలియకుండా పడివున్నాడు. దగ్గరున్న పెద్దకూతురు యాన్టకోవాకు యిదంతా పట్టలేదు. ముసలాడి బరువు యెలా వొదిలించుకోవాలో ఆలోచిస్తుంది. తనకేమీ పంచిపెట్టకుండా ముసలాడు అంతా యేదో కొంతమట్టుకి తన చావుఖర్చుల కోసం అట్టిపెట్టుకొని తక్కినదంతా రెండోకూతురు జూలీనాకు ముట్టచెప్పాడు. ముసలాడు చేసిన యీపని యాన్టకోవాలో ద్వేషాన్ని రగుల్కొలిపింది. చచ్చేవాడు అక్కడే చావక తనయింటి కెందుకొచ్చాడని యాన్టకోవాకు మంట.

''లే! లేచికూర్చో!'' అని యాన్టకోవా కఠోరంగా అరిచింది.

ముసలాడు కేకకు అదరిపడ్డాడు. ముఖంమీన దుప్పటిముసుగు తొలిగింది. ముఖము ముడతలుపడి పాలిపోయివుంది. వెంట్రుకలు పూర్తిగా నెరిసిపోయినై. ముసలాడు యింకా మూల్గుతూ కళ్ళుమూసుకునే వున్నాడు.

''లేవే'' అని మళ్ళీ కూతురు గట్టిగా అరచింది.

''తాతా'' అంటూ తల్లిదగ్గరున్న చిన్నపిల్ల దీనంగా చూస్తుంది. ఆపిల్ల కళ్ళల్లో నీరు కమ్మినై.

అక్కడేవున్న కుక్క ఒకటి మంచముమీద వున్న పరుపు వాసనజూస్తూ నోటితో లాగుతూవుంది.

యాన్టకోవాకు కోపము హెచ్చింది.

పిల్లని చేత్తో దూరంగా ఒకనెట్టు నెట్టింది. కుక్కను కాలితో ఒక తన్ను తన్నింది. ముసలాడిని 'లేవే' పిడికిలితో ఓ పోటు పొడిచింది.

పిల్లయేడుస్తూ దూరంగావున్న స్టౌదగ్గరకు పోయి నిలబడింది. కుక్క కుయ్ మంటూ గదిబయటికి వెళ్ళింది.

ముసలాడు మాట్లాడే పరిస్థితిలో లేడు. తల ఒకవైపుకి వ్రాలిపోయింది. శ్వాస

బిగబట్టింది. యింకా యెక్కువసేపు బ్రతికేటట్లు లేదు.

“నీవు యిక్కడే చావాలనుకుంటున్నావేమో? కుదరదు. జాలీసా యింటికే వెళ్ళు. నీఆస్తి దానికే యిచ్చావు. కాబట్టి అదేనిన్ను చూడవలసింది. నాకేమి సంబధము లేదు. లే!”

అని ఆమె యింకా యేంటో అనబోయింది.

ముసలాడి పెదవులు విడిబడ్డాయి. ఆమె యేంచెప్పతాడోనని దగ్గరకువచ్చి తిలకించింది.

“ఓ దేవుడా! ఒ ఏసుక్రీస్తూ!.........”

ఆమె కోపము పట్టలేకపోయింది. ముసలాణ్ణి మంచంమీదనుంచి ఒక తోపు తోసింది. ఆ తోపుతో అతని శరీరము నడుందగ్గరనుంచి క్రింది భాగము అంతా మంచము క్రిందకు జారింది.

“ప్రీస్టు, ప్రీస్టు” అంటూ ముసలాడు మళ్ళీ గొణిగాడు.

“ప్రీస్టు......నీచావు దగ్గరకొచ్చింది. ప్రీస్టు దగ్గరకే పంపుతా. రా!” అని ఆమె పళ్ళు పటపట కొరుకుతూ ముసలాణ్ణి నడుంక్రింద చేతులుపెట్టి లేపింది.

బయటనుంచి యెవరో మనిషి వస్తున్నట్లు అలికిడి అయింది. ఆమె వెంటనే ముసలాణ్ణి పడుకోబెట్టి ముసుగుకప్పింది. కాళ్ళు యింకా వ్రేలాడుతూనే వున్నై. సరిగ్గాపడుకోబెట్టే టైమ్‌కూడాలేదు.

ప్రక్కయింటి డిజియాక్ భార్య లోపలికి వచ్చింది. “నయంలేదూ?”

“మాతండ్రి బ్రతికేటట్లులేడు.” యానకోవా కంఠములో మార్పువచ్చింది.

“భయపడకు, ఫరవాలేదు.” అంటూ డిజయాక్ భార్య ముసలాడి మంచం దగ్గరకు వచ్చింది.

“ప్రీస్టు. ప్రీస్టు.”

“ప్రీస్టు కావాలంటున్నాడు. ప్రీస్టుకోసము పంపారా?”

“ఎవరున్నారు? నీవే ఆ పుణ్యము కట్టుకోవాలి.” అని యానకోవా దీనంగా అంది.

“సరే! పిలుస్తానని” డిజియాక్ భార్య బయటికి వెళ్ళింది.

యానకోవా ముసలవాణ్ని పట్టుకొని లేపి సరిగ్గా మంచంమీద పడుకోబెట్టింది. గది అంతా శుభ్రముచేసి సామాన్లన్నీ అలమర్లో వుంచింది.

అప్పుడప్పుడు ఆమె ముఖంలో ద్వేషభావము కనబడుతూవుంది. మధ్య మధ్య చేతులు నలుపుకోటం, కొంగ్రడించి వూయటం మొదలైన చేష్టలు చేస్తూ వుండేది.

"కాస్తా, కూస్తా! పదియేను యెకరాలభూమి, పశువులు, మేకలు, పందులు ఇంకా యెంతసామాను?...ఇందులో సగం...కనీసం ఐదారువేలైనా కిమ్మతు చేసేది.......అంతా...యీఆస్తిఅంతా దానికేయిచ్చావ్. నన్ను దరిద్రంలో ముంచాలనుకొని యీపని చేశావ్. అనుభవించు. యీపాపాన్ని నీవే అనుభవించు. చచ్చి పురుగులపాలుకా."

ఆమె కోపానికి అంతులేదు. 'ఛీ' అని మళ్ళీ అరిచింది. ముసలాడు కదలలేదు. పిడికిటితో మళ్ళీ వొకపోటు పొడిచింది.

"నీవు యిక్కడే చావాలనుకుంటూన్నావ్? ఖర్చంతా నాచేత పెట్టించాలనుకుంటున్నావ్? జూలీనా యింటికే వెళ్ళు. అక్కడే నీ ఆస్తివుంది. అక్కడే చావు."

ప్రీస్టు అతనివెంట మరికొందరు యింట్లో ప్రవేశించారు. యాన్టకోవా ప్రీస్టుకి మొక్కి, యేడుస్తూ దూరంగా ప్రీస్టువెంటవచ్చిన మనుష్యుల దగ్గర నిలబడింది. ఆప్రీస్టు క్రిస్టియన్ మతప్రకారం మరణావస్థలోవున్న ఆ ముసలాడి ఆత్మకు శాంతికలగటానికి చేయవలసిన విధుల నెరవేర్చి వెంటవచ్చిన మనుష్యులతో పాటు తిరిగి వెళ్ళాడు.

రాత్రి 8 గంటలు

ఆమెలో ఆవేశభావాలు పరుగెత్తుతున్నై. మూలనున్న స్టూలు మంచం దగ్గరకు లాక్కొని కూర్చొంది, కాలంగడిచి పోతూవుంది. యాన్టకోవా మధ్యమధ్య లేస్తూ మళ్ళీ కూర్చుంటూ యేదో ఆలోచిస్తూవుంది. ప్రొద్దుమంకిపోయింది. గదిలో బాగా చీకటి క్రమ్మింది. ఆమె వొకసారి బజారు వైపునున్న కిటికీ వంకా వొకసారి, మంచముమీద నున్న ముసలాడి వంకా చూస్తూవుంటేది. దగ్గరున్న పిల్ల బిక్క మొఖంతో తల్లివంకా, తాతకేసి చూస్తూవుంది. కుక్క వాకిట్లో దూరంగా పండుకుని వుంది. అంతానిశ్శబ్దం.

యాన్టకోవా కిటికీలో గుండా బయటికి చూచింది. బయట ఎవరూ చప్పుడయినట్లులేదు. మంచు బాగా కురుస్తుంది. ఆమె తిరిగి మంచం దగ్గరకు వచ్చి వొక నిమిషం నిలబడింది. వెంటనే ముసలాడిని చంక కిందకు చేతులు పోనిచ్చి బరువుగా పైకి యెత్తింది,

"మాగ్దా! తలుపు తీయ్." పిల్ల గాభరా పడితలుపు తెరచింది.

"ఇటురా! కాళ్ళుపట్టుకో!"

తల్లి చెప్పినట్టు మాగ్దా ముసలాడికాళ్ళు రెండూపైకి యెత్తిపట్టుకుంది.

"గట్టిగా పట్టుకొని వెంట నడిచిరా!"

ముసలాడు యిదంతా తెలియని జబ్బులో వున్నాడు. యాన్టకోవా కష్టంలో ముసలాణ్ణి గడప బయటకు లాగింది. పిల్ల మోయలేక కాళ్ళు వదలి పెట్టింది. యాన్టకోవా ఒక్కతే ముసలాణ్ని ఇంటి బయటికి లాక్కుపోయింది. ముసలాడి కాళ్ళు నేల మీద రాచుకుంటూ పోవటంచేత మంచులో తెల్లగా రెండు చారలు యేర్పడ్డాయి.

మంచు విపరీతంగా కురుస్తున్నది. చలిబాధకి ముసలాడిలో కొంత కదలికవచ్చింది.

"ఓ దేవుడా!...ఓ...జాలీనా......జాలీ...,'

"ఆ! మూల్గు. బాగామూల్గు. నీయిష్టము వచ్చినట్లుమూల్గు. నీవు యెంత మూల్గినా లాభంలేదు" అని ఆమె ముసలాడిని దూరంగా వొకగోడ ప్రక్కనే మంచులో పడవేసింది. "ఇక చావు" అని బూట్ కాలితో ముసలాడిని తన్నింది. వొంటిమీద వున్న చొక్కా, తలకి కట్టిన గుడ్డ వూడదీసుకొని యింట్లోకి వెళ్లింది.

గదిలో లాంతరు వెలిగించి కిటికీ వంక మరోసారి చూచింది. ముసలాడి చొక్కా జేబులన్నీ పరీక్ష చేసింది. ఆమె ముఖంలో కొంత సంతోషం కనబడింది. చొక్కా లోపలి జేబులోనుంచి కొన్ని కరెన్సీనోట్లు, వెండి రూబుల్సు బయటికి తీసింది. "ఆ! చావు ఖర్చులకి దాచుకున్న డబ్బు" అని ఆమె వాటిని జాగ్రత్తగా వొక గుడ్డలో మడిచి దాచి పెట్టింది.

యాన్టకోవా మనస్సుకి స్థిమితం చిక్కినట్లులేదు. ఆమెకు యిప్పుడు యింటి సంగతి గుర్తుకు వచ్చింది. గదిలోనుంచి బయటికి వచ్చి "ఇగ్నాట్! ఇగ్నాట్! యెక్కడ చచ్చావు? ఇంట్లో నీళ్లులేవు." అని పెద్దగా కేకలు వేసింది.

ఇగ్నాట్ పదిసంవత్సరాల కొడుకు. తల్లి కొట్టటముచేత వాడు ప్రొద్దున్నుంచీ యింట్లోకి రాకుండా బజార్లో తిరుగుతున్నాడు. తల్లి కేకవిని భయంలో వాడు నెమ్మదిగా యింట్లో ప్రవేశించాడు. వచ్చిరావటంతోనే యాన్టకోవా కొడుకుని "నీళ్లు తేకుండా యెక్కడ చచ్చా"వని గబాగబా బాదింది. ఇగ్నాట్ యేడుస్తూ మళ్ళా బయటికి పారిపొయ్యాడు.

మాగ్డా యేడుపు ముఖముతో ఒక మూలనుంచి ఆమె దగ్గరకి వచ్చింది. ఆమె ఆ పిల్లని కసరి దూరముగా నెట్టింది.

..............

భర్త పొలాన్నుంచి యింటికి వచ్చేటప్పటికి బాగా ప్రొద్దు పోయింది. కోటు వూడదీసి మంచు దులిపి, కాలి బూటు నేలకు కొట్టి లోపల ప్రవేశించాడు. స్టూలుఒకటి స్టౌదగ్గరకి లాక్కొని బద్ధకంగా కూర్చొబడ్డాడు.

యువనే గౌన్ అతడికి రొట్టె, కూర అందించింది. అతడు త్వరత్వరగా పూర్తి చేసి 'ఇంకా కావాలా?' అన్నట్టు ఆమె ముఖం కేసి చూశాడు. ఆమె మరో రొట్టె అందించింది. అతడు వేగం తగ్గించి నెమ్మదిగా తినటం ప్రారంభించాడు. యీసారి అతని దృష్టి మంచంమీద పడింది.

"ముసలాడేడీ?"

"బయట మంచులో—"

"ఆఁ నే ననుకున్నట్టే చేశావు. ఆ సీటంతా ఖాళీ చేస్తే చెంపకింద కట్టె మనకు మిగిలింది. మనల్ని తినేస్తున్నాడు. త్వరగా చావటం మంచిది."

యానటిక్ రొట్టె తిన్న తరువాత చుట్ట ముట్టిస్తూ: "ముసల్లాడు మనల్ని అన్యాయం చేసాడు. లేకపోతే యింకా ఐదారు కతరాలు చేజిక్కేది. దాంతో పాటు ఒకటో రెండో గుర్రాల్ని, నాలుగైదు పశువుల్ని కూడా కొనుక్కునే వాళ్ళం"

పిల్ల మూలకూర్చొని నిద్రపోతున్నది. యానటిక్ పిల్లని లేవదీసుకొచ్చి ప్రక్క మీద పడుకో పెట్టింది. తరువాత తాను దాచిపెట్టిన గుడ్డమూట తెచ్చి భర్తకిచ్చింది.

"ఏంటది?"

'నువ్వే చూడు!'

అతడు మూట ముడ దీసాడు. ముఖం వికసించింది. నోట్లు నాణాలు, రెండు సార్లు లెక్కపెట్టాడు.

"ఎక్కడిదీ?"

'అప్పుడే మరిచిపోయావా? ముసలాడు తనచావు ఖర్చుల కోసం కొంత దాచి పెట్టుకుంటానని చెప్పలా? బొక్కాల జేబులో దాచి పెట్టుకున్నాడు.... మనల్ని అన్యాయం చేసాడు. ఇది మన సొమ్మే."

"ఆ! మంచిదే! భద్రం చెయ్యి! మొన్నే అనుకుంటాము. స్కార్లెట్ కన్నబడ్డి వొక వెయ్యి రూబుల్సు అప్పడిగాడు. వాడి పదియెకరాల్ని తాకట్టు కూడా పెడతానన్నాడు. పొలం మన స్వాధీనంలోనే వుంటుంది."

"మరి డబ్బంతా యేదీ?"

"ఆ! డబ్బుకేంలే. చాలకపోతే పశువుల్ని పందుల్ని చిన్నా పెద్దా అన్నీ అమ్మేద్దాం. నాలుగేళ్ళలోగా తిరిగి డబ్బు చెల్లించే షరతుమీద తాకట్టు పెట్టించుకుందాం. అలా చెల్లించ లేకపోతే పొలం మన భుక్తం అయ్యేటట్టు వ్రాయించుకుందాం. స్కార్లెట్ బాకీ తీర్చుకోలేడు. పొలం మనక్రిందే వుండి పోతుంది... ద్యూమిన్స్, డిజియాక్ పొలం యిట్లానేగా కాజేసింది."

యానకోవా సంతోషానికి మితం లేదు.

'ఇగ్నాట్ యేడీ'

"వాడు పారిపోయ్యాడు. ఇంటిల్లోకి వోక బకెట్ నీరుకూడ తేకుండా వెళ్ళాడు."

యాన్ టెక్ బకెట్‌తో నీరు తెచ్చిపోసాడు. ఇగ్నాట్ - తెమ్మత్రిసా యింట్లో ప్రవేశించి గది దగ్గరకు వచ్చి తొంగిచూస్తున్నాడు. యెవరూ అతణ్ణి పలకరించలేదు. ముసలాడి సంగతి యెవరూ యెత్తలేదు. భోజనం పూర్తయ్యాక అంతా మంచాలు వాల్చుకున్నారు.

..........................

ముసలాడు బయట చలిబాధకు తట్టుకోలేక మూల్గుతున్నాడు. అతడి మూల్గు యెవరూ వినిపించుకోలేదు. చివరకు యేమైపోయ్యాడోనని బయటకొచ్చి తొంగి కూడా చూడలేదు. మంచువల్ల ముసలాడి శరీరము కొయ్యబారి పోయింది. నోటినుంచి నురుగు బయలుదేరింది. మూల్గుతూ, నిస్సహాయ స్థితిలో వున్న ముసలాడు అర్థరాత్రికి ప్రాణాలు విడిచాడు.

లోపల యాన్ టెక్ నిద్రపోతూ కలలు కంటున్నాడు. స్మారెట్ … పొలం తాకట్టు పెట్టించుకోట్టం, తాను పండించుకోట్టం కనబడుతున్నై.

తెల్లవారక ముందే యానకోవా భర్తను లేపింది. లేపి ముసలాడున్న చోటు దగ్గరికి తీసుకొచ్చింది. చచ్చిపడిఉన్న ముసలాడి దేహాన్ని చూట్టానికి భయంకరంగా వుంది. యాన్ టెక్ గాభరాతో వెనక్కి తిరిగాడు.

'తెల్లవారుతుంది. శవాన్ని లోపలికి చేరయ్యాల్రండి' అని యానకోవా భర్తని పట్టుకుంది.

యాన్ టెక్ తటపటాయిస్తూ భార్యమాటకి వప్పుకొన్నాడు. యిద్దరు ముసలాడి శవాన్ని లేవనెత్తి గొడ్లచావిట్లోకి చేర్చారు. యానకోవా ముసలాడి మొహం తుడిచి ముసుగు కప్పింది.

'జాలీనాకు కబురు చెయ్యాలి'

'ఆ! కబురు పంపు. ఆస్తి దానికే సంక్రమించింది. ఖర్చులు అదే భరించవలసి వుంటుంది. మనకు సంబంధం లేదు.'

తెల్లవారింది. జాలీనా, జాలీనా భర్త టో మెక్, వచ్చారు. ముసలాడు చచ్చాడని వూరంతా తెలిసింది. ఇరుగుపొరుగు జనం వచ్చి చూసిపోతున్నారు. పంచాయతీ వారు ఖర్చులు యెవరు భరించాలో నిర్ణయించటానికి సమావేశం అయ్యారు. ఈ మధ్యలో అక్కచెల్లెళ్ళ మధ్య పోట్లాట మొదలైంది.

'ముసలాడి ఆస్తంతా నీవే కాజేసి మమ్మల్ని అన్యాయం చేసావు'

'ముసలాడి ఆస్తి మేము డబ్బిచ్చి కొనుక్కున్నాం. తనచావుఖర్చుల కోసమని ముసలాడే అమ్ముకున్నాడు.'

'పచ్చి అబద్ధాలు. ముందు డబ్బు కాజేసి ఆడబ్బుతో పొలం రాయించుకున్నాడు. చివరికి ముసలాడికీగతి పట్టింది. నీవు ముసలాడి కడుపున పుట్టాలిసిన దానివి' కావు. కుక్కకడుపున పందికడుపున పుట్టాల్సినదానివి.'

'నోరుమూయ్. నీకు శాస్తి జరుగుతుంది.'

'ఛీ లంజా!'

'నీవే లంజవు.'

ఇద్దరి చేతులూ కలిసినై. గోళ్ళతో గీక్కున్నారు. చేతుల్తో కొట్టుకున్నారు. ఒకరి మీదవొకరు పడ్డారు. వచ్చిన జనానికి విడదీయటానికి సాధ్యం కాలేదు. చివరకు అలుపొచ్చేదాక కొట్టుకుని యిద్దరూ లేచియేడ్వటం మొదలెట్టారు.

పంచాయతీ దార్లు టోమెక్ నే ఖర్చులు భరించుకోవాలని తీర్పు చెప్పారు. ప్రీస్టువచ్చి శవానికి చేయవలసిన కర్మకాండలు చేసిన తరువాత శవాన్ని పెట్టెలోపెట్టి యెత్తారు. ముందు ప్రీస్టు తరువాత వచ్చిన జనం శవాన్ని వెంబడించారు.

ప్రీస్టు లాటిన్ భాషలో మంత్రాలు చదువుతూ నడుస్తున్నాడు. ఇగ్నాట్ వూరేగింపుకు నాయకత్వం వహించినట్లు గర్వంగా ముందు నడుస్తున్నాడు. అక్కా చెల్లెళ్ళు మౌనము వహించి అప్పుడప్పుడూ ఒకరి ముఖం ఒకరు చూస్తూ వెనుక నడుస్తున్నారు. యెదురుగా వచ్చేజనం తలవంచి ప్రక్కకు తప్పుకుంటున్నారు. కుక్కలు దూరంగా పక్కసందుల్లో వుండి అరుస్తున్నై. పిల్లలు, ఆడవాళ్లు, ముసలిరకం ఇళ్ల కిటికీల్లోనుంచి తొంగిచూస్తున్నారు.

శవం స్మశానభూమికి చేరింది. గోయి సిద్ధం చేయబడ్డది. ప్రీస్టు ఉదకం (హోలీవాటరు) చల్లిన తరువాత శవాన్ని పెట్టెలోనుంచి బయటికి తీసారు. చివరికి మంత్రాలు చదవటం, శవాన్ని వూడ్చిపెట్టటం కూడా పూర్తిఅయింది. వచ్చినజనం, ప్రీస్టు తిరుగుముఖం పట్టారు. టోమెక్ శవంవెంట వచ్చిన పెద్దల్ని తన యింటికి ఆహ్వానించాడు.

యాన్ పెక్ టోమెక్ యింటికి వెళ్ళలేదు. భార్యని, కొడుకుని, స్కొలెట్ ని తీసుకొని ఒక హోటల్లో ప్రవేశించాడు. అంతా కడుపునిండా మాంసం నింపి తృప్తిగా తప్పతాగారు. ఆ మత్తులోనే యాన్ పెక్ తాకట్టువిషయాన్ని గూర్చి స్కొలెట్ తో మాట్లాట్టం ప్రారంభించాడు.

యాన్ పెక్ కదలలేని స్థితిలో వున్నాడు. యాన్టకోవా అతణ్ణి గట్టిగా పట్టుకుని వుంది. స్కొలెట్ డబ్బు చేజిక్కుతుందనే భావంలో యింకో డోస్

రొక్కవ పుచ్చుకున్నాడు. ఇగ్నాట్ ఆ మత్తులోనే యింటిదోవపట్టాడు.

చూడూ! కాస్తా, కూస్తా, ఐదెకరాలు మనకిందకు వస్తుంది.........చలికాలంలో గోధుమలు, బార్లీ పండిస్తాను. ఎండాకాలములో బంగాళదుంపలు......'

'నోరు మూసుకో! పడిపోతావు' అని భార్య అతణ్ణి పట్టుకుంది.

మత్తు వదిలేటప్పటికి చీకటిపడింది. అంతా గాఢాంధకారముగా వుంది. యాన్టకోవా, యాన్ పెక్ తాకట్టు పొలములో యేం చేస్తే బాగుంటుందో మాట్లాడుకుంటూ నెమ్మదిగా యింటిముఖం పట్టారు.

# నాకు నయంచేస్తారా ?

ఇరిక్ వాన్ లూ అనే గొప్ప డాక్టరున్నాడు. అతడు మానసిక వ్యాధులకు చికిత్స చేస్తాడు. వయసులో చిన్నవాడైనా అనుభవములో చాలా పెద్ద. మంచిపేరుకూడా వుంది. వీటన్నిటితో పాటు చాలా అందముగా కూడా వుంటాడు. తలపెట్టిన అన్నిపనులు సాధించేవారు ఎవరైనా వున్నారనుకొంటే వారిలో యితడొకడనుకోవచ్చు. అయితే యీ డాక్టరు దగ్గరికి తనచేతకాదని విడిచిపెట్టాల్సిన కేసొచ్చింది. ఎంత గొప్ప డాక్టరుకైనా యిటువంటి కేసులు కొన్ని తగలకపోవు అయితే యిక్కడ గమ్మత్తు యేమిటంటే రోగి జబ్బు డాక్టరుకు కూడా అంటుకొంది.

డాక్టరు గదికి ఒకరోగి ,వచ్చాడు. మనిషిని చూస్తే నిద్ర లేనట్లు కనిపిస్తున్నాడు. ముఖం కళాకాంతులు లేకుండా వుంది. అయినా సంతోషంలో వున్నవాడిలాగా చిరునవ్వుతో డాక్టరుగారున్నారా అంటూ గదిలోకి వచ్చాడు. గదిలో వున్న నర్సు 'నీ పేరేం' టని అడిగింది.

'నాకు జబ్బుగావుందని డాక్టరుతో చెప్పు' అన్నాడు.

'ఆ సంగతి డాక్టరుతో చెప్పాల్సిన అవసరం లేదు. ఇక్కడికొచ్చే వారంతా కాస్తోకూస్తో జబ్బులోనే వస్తారు. నీ పేరు తెలుసుకొని యిక్కడ రాసుకోవాలి' అని నర్సు నవ్వుతూ జవాబు చెప్పింది.

తానుకూడా నవ్వుతూనే 'ఈయన డాక్టరు కాడా ఏంటి? నా పేరు రోగము గాదు. రోగము నాకు వుందని చెప్పు' అన్నాడు.

నర్సు నవ్వటం మానేసింది. వీడికున్నరోగము ఏదైనాగానీ అదిమాత్రం వీడి మనస్సు కెక్కిందిలే అనుకుంటూ డాక్టరుదగరకి పోయి చెప్పింది.

డాక్టరుకూడా నవ్వాడు. 'మన పద్ధతులన్నీ ఆచారములో పెట్టాలని అనుకో

బోకు. రోగి తన సంగతి రహస్యంగా వుంచాలనుకొంటే వుంచనివ్వు. కాసేపు కూచోమని చెప్పు. అవసరమైన సంగతులన్నీ నేను తెలుసుకొంటాలే' అన్నాడు.

ఈ మాటలు చెపుతూ డాక్టరు గర్వంగా నవ్వాడు. నర్సు స్వంతంలో మనసులో ముసిముసి నవ్వులు నవ్వింది. వారిద్దరి నవ్వుల్లోనూ అర్థంవుంది.

డాక్టరుగారికి ప్రాక్టీసు చాలా ఎక్కువగా వుంది. అందుచేత ఆ రోగి మూడు గంటలు కూచోవాల్సొచ్చింది. ఓపిక లేనివారికి అంతసేపు కూర్చోవాలంటే కష్టము. కాని నర్సుకు ఆ రోగి విసుక్కుంటున్నట్లే కనిపించలేదు. కుర్చీలో మాట్లాడకుండా కూర్చున్నాడు. కిటికీపక్కనే కూర్చున్నా కిటికీ లోంచి బజారులోకికూడా చూట్టం లేదు. గోడకేసి చూస్తున్నాడు-నవ్వాడు. ఒకగంట గడిచిం తర్వాత నర్సు డాక్టరు దగ్గరకు వెళ్లి 'డాక్టరు గారూ, అతడు విచిత్రంగా వున్నాడు' అన్నది.

'ఎవరు' అని అడిగాడు డాక్టరు.

నర్సు జవాబు చెప్పింది 'ఎవరూ! పేరు చెప్పటాని కిష్టంలేని ఆమనిషి, నిజంగా ఆ మనిషికి మతి చెడ్డ దనుకుంటాను.'

డాక్టరు విసుగ్గాఅన్నాడు. 'ఏమిటీ గోలంతా, నాపని పూర్తిగానివ్వు. ఇతరులకు కష్టం కలిగించనంతవరకు అతనిని అట్లాగే కూచోనివ్వు. జీవితంలో అంతకంటే కావాల్సిం దేముంది.'

నర్సు కోపంగా రోగి కూచున్న గదిలోకి వచ్చింది. రోగి యధాప్రకారం నవ్వుకుంటూ కూర్చున్నాడు. నర్సు మధ్య మధ్య అతన్ని విచిత్రంగా చూస్తూ లోపలికి పంపటానికి అవకాశంకోసం వేచివుంది. చివరకు అవకాశం వచ్చింది. ఆమె అతని భుజంమీద చెయ్యివేసి 'నీవంతు వచ్చింది' అంది.

రోగి లేచి 'ఆ, నిజంగా నావంతు వచ్చిందా' అంటూ లోపలికి వెళ్ళాడు. అతన్నిచూచి డాక్టరు 'నీకు పేరివ్వటంయిష్టం లేదని నర్సు చెప్పింది. సరే దాం దేముంది గాని నీ వయసెంత? నీ వృత్తి ఏంటి?'

డాక్టరును రోగి, రోగిని డాక్టరు పరిశీలనాదృష్టితో ఒకళ్ళ నొకళ్ళు చూసుకొన్నారు. కొన్ని క్షణాలు గడిచాక రోగి యిట్లా అన్నాడు.

'వయస్సులోను, వృత్తిలోను, ఎందుకు. నాజబ్బేమిటో కనుక్కోవచ్చు. నే నడిగేదేమిటంటే అసలు నీవు నాకు వైద్యం చేయగలవా?'

డాక్టరు స్నేహపూరితమైన చిరునవ్వు నవ్వాడు. 'అట్లాగా! రోగ లక్షణా లేంటి?'

రోగి నెమ్మదిగా జవాబు చెప్పాడు. 'నా రోగానికి లక్షణాలు లేవు.'

'అయితే నన్నేం చేయమంటావు?'

'నా రోగం నాకంటే మీకెక్కువ తెలియాలి. మీరు డాక్టర్లుకదూ? రోగాల్ని రోగుల్ని మీరు నయం చెయ్యాల్సిలేదూ? డాక్టరంటే ప్రజలకు స్నేహితుడు. ఒక్క డబ్బు సంపాదించటమే కాక ప్రజలకు సాయం చెయ్యటం అతని విధి. అవునా? అయితే నాకు సహాయం చేయి. నీకుచేతనైతే...........

డాక్టరు ఒకక్షణమాలోచించి అతన్ని పరీక్ష చేసాడు. పుష్టివుంది. అకస్మాత్తుగా 'నీకు పెళ్ళయిందా?' అని అడిగాడు.

'అయింది' అన్నాడు,

'డైవర్సు చేశావా?'

'కాదు, భార్య చనిపోయింది.'

'ఎన్నాళ్ళయింది?

రోగి లేచి తన జేబులోనుంచి గడియారంతీసి టైం చూచి జవాబు చెప్పాడు. 'ఏడుగంటల యిరవై నిమిషాలు.'

'సరే, నీబాధ నాకర్థమయింది.' అని మొదలు పెట్టాడు డాక్టరు.

రోగి ఆశ్చర్యంగా చూస్తూ 'ఆ నిజంగానా?' అన్నాడు.

డాక్టరింకా మరికొన్ని ప్రశ్నలు వేశాడు. రోగి భార్య కిరవై సంవత్సరాలట. రోగి కిరువై ఆరు. అతని భార్య చనిపోవటానికి కారణ మడిగాడు డాక్టరు.

విషప్రయోగం అని జవాబు.

'ప్రమాదవశాత్తు జరిగిందా?'

'కాదు. ఆత్మహత్య'

డాక్టరింకా అంతకంటె లోతుకు దిగదలుచుకోలేదు. అతను యితరులకు సాయం చేయాలిగాని కేసులు విచారిస్తూ కూర్చోగూడదు.

'నీకు జబ్బేమీ లేదు. భార్యపోవటంవల్ల నీకు మనస్సు చెడ్డది. కొద్దిరోజుల పాటు మీ విషయము జాగ్రత్త తీసుకో నేవారెవరైనా వుంటే...........

'అయితే ఆ పని మీరే ఎందుకు చేయగూడదు? దీనికి మీరే తగ్గవారు. అవునా? మీరు డాక్టర్లు. మీ వృత్తి మహాదొడ్డది. ఇతర్లకు సహాయము చేయటానికి మీరు మీ జీవితం అర్పణచేశారు. కనక మీ మీద ఆధారపడ బుద్ధవుతుంది. మీరు ఇతరులకు హాని చేయలేరు— మంచిమాత్రమే చేయగలరు.'

డాక్టరు విచారిస్తూ 'పాపము, యితని కెవరూ లేరుకాబోలు' అనుకున్నాడు.

'నన్నే అతని విషయము జాగర్త ఎందుకు తీసుకోమంటున్నాడో భగవంతుడికే తెలుసు. నిద్రరావటానికి మందిస్తే బాగుంటుంది. తప్పకుండా

యితనికి నిద్ర కావాలి. ఇంతకంటె ఇతనికి నేనేం చేయగలను?'

డాక్టరు కాసేపు ఆలోచించి ఇలా అన్నాడు. 'ఈ దుఃఖాన్ని కలిగించిన కారణాన్ని గూర్చి కాస్త నాతో చెపితేనైనా మీ మనస్సుకు శాంతి కలుగుతుందేమో? నేను నీకు క్రొత్తవాణ్ణి. అయితే నేను చాలా దయగలవాణ్ణి. పైగా డాక్టర్లదగ్గర ఉన్న దున్నట్లుగా చెప్పకపోతే పని జరగదేమో............'

డాక్టరు ఈ మాట అని వెంటనే తా నెందు కన్నానా అని విచార పడ్డాడు. ఆ విషాద సంఘటనానికి కారణాలు విచారించవలసిన అవసరము ఏముందాఅని అనుకున్నాడు.

'నేనడిగినమాటలు ఇతనికి చాలా బాధకలిగించి ఉంటయ్యేమో. అయిందేమో అయింది. ఇప్పుడేంచేయాలి?' అని అనుకుంటూ ఉండగానే రోగి నవ్వుతూ ఇలా అన్నాడు.

'సరే నేను నీకు చెబుతాను. నిజంగా నాకు చెపటానికి సిగ్గేస్తుంది. నేను గాని ఆమెగాని ఆవిషయములో సిగ్గుపడాల్సింది లేదనుకుంటాను. ఎందుకంటే అలాంటి విషయాలు మామూలుగా జరుగుతుండేవే. మీరు కూడా వాటిని గురించి చాలసార్లు వినివుంటారు.' ఈ కబుర్లు వింటుంటే డాక్టరుకు విసుగు గల్గింది. వీడ్ని వదిలించుకుంటే బాగుంటుం దనుకున్నాడు. అయినా కాస్త ఓర్చుకొని నెమ్మదిగా ఇలా అన్నాడు.

'నాకు వింతకథలు వినాలని లేదు. నీ మనస్సుకు శాంతి కలుగుతుందని నీ వనుకుంటే మాత్రము నీ సంగతి చెప్పు' అన్నాడు.

రోగి కొద్దినిమిషాలు ఆలోచిస్తూ మౌనంగా కూర్చున్నాడు. కాసేపు గుటకలు మ్రింగి ఇలా అన్నాడు.

'అవును. కొంతవరకు ఒకవిధంగా నామనస్సుకుకూడా శాంతికలుగవచ్చు- ఆమె నేను మూడు సంవత్సరాలు కాపురంచేశాము. అప్పుడు మేము సుఖంగా వున్నామని నేను చెప్పగలను. నేను ఎప్పుడు ఆమెను గూర్చి తప్ప ఇతరులను గూర్చి ఆలోచించేవాణ్ణి కాదు. ఆమె కూడా మొదట్లో నా విషయము తప్ప ఇంకెవరి విషయంఆలోచించేది కాదు. అందుకనే మేము సుఖంగా ఉన్నాము. కాని నిరుడు చాలరోజులు నేను ఆమెను వంటరిగా విడిచి వెళ్ళాల్సి వచ్చింది. అప్పుడామెకు నే నెరుగని ఒక క్రొత్తమనిషితో పరిచయ మేర్పడ్డది. అతనిని ప్రేమించింది. అది ఆమె తప్పా? అందుకామె నవాల్సిన పనేముంది?"

డాక్టరు ఇలా అన్నాడు. "ఆమార్పు రావడములో బహుశా ఆమె తప్పేమీ లేదు. ప్రేమ పిలువని పేరంటానికే వస్తుంది."

రోగి నవ్వుతూ ఇలా అన్నాడు. "సరిగ్గా నావుద్దేశమే నీవు చెప్పావు.

ఏది ఎలాగున్నా ఆమె తన ప్రేమను ఆపుకోలేకపోయింది. మరి నేచెప్పేదంతా శ్రద్ధగావిను. నాతోపోలిస్తే అతడు చాలా గొప్పవాడు, అందగాడుకూడా. ఈ విషయంలో నేను బడాయి చెప్పాల్సిన అవసరము లేదని నీకే తెలుసు. తనపనియేదో తను తీర్చుకొన్నాడు. నిజంగా తాను ఆమెను ప్రేమించటము లేదని క్రమేణ ఆమె తెలుసుకునేటట్లు చేశాడు. ఆమె అందంమాత్రము ఇంతంతని చెప్పటానికి వీలులేదు. ఆమె ఫుటో చూడటం నీకు ఇష్టమేనా ?''

డాక్టరు ఏదో తనకిష్టములేనట్లుగా కొంచెం సూచన చేశాడు. కాని అతడు అంతకుముందే జేబులోనుంచి ఫుటోతీసి డాక్టరుచేతిలో పెట్టాడు. డాక్టరు ఫుటోవంక చూశాడు. రోగి కాసేపు మౌనంగా ఉండి మళ్లీ ఆరంభించాడు.

''నేనుచెప్పింది నిజమేనా-ఆమె చాలా అందమయింది? అతనుకూడా ఆమెను ప్రేమించాడంటే ఆశ్చర్యమేమీలేదు. అయితే ఆమెతో ఎల్లకాలము అలా ఎందుకుండలేకపోయాడు? మరేంలేదు, అతనికి చాలామంది ఉన్నారు. ఈ దరిద్రుడి జీవితాన్ని గురించి ఇప్పుడు నీకంతా తెలిసిందనుకుంటాను. ఇది నా కథ.'

అని చెప్పి కనుబొమ్మ లెత్తి డాక్టరువంక ఏదో ప్రశ్నించుచున్నట్లుగా చూచాడు. అ ముఖములో విచారముకూడా కనబడుతుంది.

డాక్టరుగారూ! నాకు ఒక గ్లాసెడు మంచినీళ్ళు మీరు ఎందుకీయ్యగూడదు? వైద్యుడుగా మీ వృత్తి మానవసేవచేయడం. అందుకుమీరు మానవ స్వభావం అర్థంచేసుకోవాలి. కనక నా పరిస్థితి తల్లక్రిందైందని మీరు గుర్తుంచాలి. నా కథ మిమ్మల్ని కలవరపరిచిందా? ఇక మిగతాది కూడా వినండి! అతడామెను వదిలేశాడని మీకు నేను వేరే చెప్పనక్కర్లేదు.

జీవితము సర్దాగా గడపడానికి ఆమె కొంతకాలము అతనికి ఉపయోగపడింది. ఆమెకు మాత్రము అలాకాదు. ఈ విషయము నాకెలా తెలిసిందో, మీ రెరుగుదురా? ఇది నేను కనిపెట్టలేదు. తనంతటతానే ఆమె ఈ కథ నాకు చెప్పింది. ఇలా చేయుటం చాలా బాగున్నా పూర్తిగా ఇది మంచి పని యని నేననను. అతని విషయమై ఆలోచనలోపడి తక్కిన ప్రపంచాన్నే మరచిపోయింది. జాగర్తలన్నీ విడిచిపెట్టింది. అది ఆమె నిశ్చలత్వాన్ని నాశనం చేసింది. ఆమెకు నా యందున్న ఆదరణ మాయమయింది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆమెలోని ఆ మాయ్స తక్కిన సమస్తాన్ని నాశనం చేసింది. ఆమెకు తన రహస్యాన్ని చెప్పుకోడానికి ఎవరయినా ఆప్తమిత్రుడు కావలసి వచ్చారో—నేనుతప్ప ఇంకెవరూ దొరకలేదు. అని చెబుతూ గ్లాసులో నీళ్ళు త్వరత్వరగా త్రాగేసి మళ్ళా ఆరోగి ఇలా ఆరంభించాడు.

"ఆమె అతన్ని కోరుకుంది, కలలుకన్నది, బాధపడ్డది, ప్రేమతో తపించింది— అయితే సాహసంకాదు. అతనికి జాబురాసింది—జవాబులేదు. తానే చూట్టానికి వెళ్ళింది—తిరస్కరింపబడ్డది. నాకు కూడా ఆమె నిరాశలలో పాలుపంచింది. పాపం జాలిపడాల్సిన విషయం. కాని నావిషయంలో మాత్రం కఠినత్వం చూపింది. అది ఆమెతప్పా? ఆమెచేష్టలన్నిటికి ఆమె జవాబుదారికాదు. నన్నే జవాబుదారి చేసిందామె. మరి అది ఎవరితప్పు? నీకు మానవస్వభావం బాగా తెలుసు. పైగా మానవసేవ చేస్తావు. కొబట్టి ఈ విషయం అంతా జరగటానికి ఎవరు బాధ్యులో నీవేచెప్పు. అది నాతప్పా? ఆ విషయంలో నేనింకా ఏమైనా చేయగలిగేవాణ్ణేనా? నేనామెను ధైర్యం చేసి స్వేచ్ఛనిస్తే బాగుండేదా? అప్పుడామె గతేమయ్యేది? ఆమెకు నేను మాత్రము మిగిలున్నాను. అతడామెను పెళ్ళిచేసుకొనేవాడని మీరనుకుంటారా? అతని కెంతమందో వున్నారు! ఆమె అంటే విసుగుపుట్టిందాతనికి. రహస్యంగా ఆమెతో సంబంధం కలిగివుంటూ తేలికగా కొలంగడపటానికి కూడ యిష్టపడని అతడామెను పెళ్ళిచేసికొనేవాడా? నీవునమ్ముతున్నావా? అది నమ్మేంత ఫూల్‌వు కాదనుకుంటా?

'ఆవిషయంలో నేనేంచేయాలా అని చాలా ఆలోచించాను. చివరకు నేనే అతనిదగ్గరకు స్వయంగా పోగలచాను. ఈవిషయం మేమిద్దరం కలిసి యీ దుఃఖాన్ని యెలాగో ఒకలాగా సర్దుకొందాం. అతడు చాలా పేరున్నవాడు, తన బాధ్యతలు తెలిసినవాడు. అందుకని తన తప్పులు వొప్పుకుంటాడు. ఇద్దరి జీవితాలు నాశనము చేయటానికి కాత డిష్టపడడు. అని నేను నిశ్చయించాను. ఇంతవరకు నే చేసింది బాగా నేవుంది. కాని వుద్దేశాల్ని ఆచరణలో పెట్టటానికి గొప్పవారికీతప్ప చేతకాదు. అలా చేయుటానికి నాకు బలము లేకపోయింది.

'నేను చేయదలచుకుంది ఆమెతో చెప్పి నేనొక పొరపాటు చేశాను. ఆమె నన్ను అలా చేయకుండా ఆటంకపరుప దలచింది. ఏమి చేయదలచింది? పాపం నిర్భాగ్యజీవి—నిజముగా నన్ను ఆటంకపరుప దలచలేదు. అలా నటించింది. కాని మనస్సులో నా ప్రయత్నమువల్ల ఫలిత ముంటుందని ఆశతో వూగులాడింది. చూడండీ డాక్టరుగారు, ఆమె నన్నప్పుడు ప్రేమించకున్నప్పటికీ ఆమెకు సాయం చెయ్యటానికి నేనుతప్ప దిక్కెవరు దొరకలేదు. నా మీదే ఆధారపడింది. నేను చేస్తానన్న ఆశతో కొస్త సంతోషపడింది. ఆ సంతోషాన్ని నేను చూశాను. ఆమెలో కనిపించే ఆ సంతోషము నా హృదయాన్ని వేధించింది. అది నేనే ఒప్పుకొంటున్నాను. నా కప్పు డాగ్ర

హాము కలిగింది. కాని అణుచుకున్నాను. అంతటితో వూరుకోక మరొక తప్పుకూడా చేశాను. నేను వెళ్ళి అతన్ని నీ దగ్గరికైనా తీసుకొని వస్తాను. అలా చేయకపోతే నేను మరల నీ వద్దకు తిరిగిరాను. ఇంతేకాని యిక యిద్దరికి జీవితములో పొత్తు కుదరదని ఆమెతో అన్నాను" అని డాక్టరుతో రోగి చెబుతూనే లేచి డాక్టరు చేతిలోని ఫొటో తీసుకొని ముద్దెట్టుకున్నాడు. తరువాత ఫొటో జేబులో పెట్టుకొని కాసేపు మౌనముగా కూచున్నాడు. అతికష్టము మీద తిరిగి యీ మాటలన్నాడు.

'నాచేత కాకపోయింది. నే చేయలేకపోయాను. నాబలాన్ని నే తెల్పుకోలేకపోయాను. మొన్న నేను యిల్లు విడిచి వచ్చాను. అతనుండే ప్రాంతాల్లో ఆ రోజల్లా తిరిగాను. అతన్ని కలుసుకోలేదు. కలుసుకో లేకపోయాను. ఇంటికైనా తిరిగి వెళ్ళలేక పోయాను. ఆమెను చూడలేను, కనీసము ఆమె మాట్లాడుతుంటే విననైనా లేనని తలచాను. ఒక హోటలుకు వెళ్ళాను. ఆమె చాలా ఆదుర్దాతో చాలా బాధపడుతుందని అర్థము చేసుకున్నాను. నేను రేపు అతన్ని కలుసుకుంటాను. రేపు నీకు శుభదినము. అందుచేత యివాళ కాస్త బాధపడ్డా పరవాలేదని అనుకొన్నాను. ఆమె బాధపడుతుందనే ఆలోచన నాకు సంతోషము కలిగించింది. నేను ఆనందించాను...'

ఫొటోను మళ్ళీ బయటికితీసి ఒకసారి చూసి త్వరత్వరగా యిలాఅన్నాడు.

'సరే డాక్టరుగారూ, నిన్నకూడా అదే కథ జరిగింది. నావల్ల కాకపోయింది. నా యిష్ట మొచ్చినంతవరకూ తిరిగాను. చెమటలు పోశాయి. అతడెలా వుంటాడో వూహించుకోటానికి ఆయనతో మాట్లాడి చూద్దామని టెలిఫోను చేశాను. మొదట ఎవరో అతనివద్ద పనిచేసే అమ్మాయి జవాబు చెప్పింది. తీరా అతనే టెలిఫోనులో మాట్లాడటానికి వచ్చేటప్పటికి రిసీవరు కిందపెట్టి నేను వెళ్ళిపోయాను. అతని మాటలైనా వింటానికి సాహసించలేకపోయాను. మీకు తేలిగ్గా అర్థమవుతుందికదూ డాక్టరుగారూ. అతనెలాగైనా నాకు పరమవిరోధి—ఈ పెద్దమనిషి ? తుదకు నా బాధలన్నీ అణచుకొని అతని యింటికి చేరుకొన్నాను. ఆ యింటి మెట్లెక్కబోతుంటే నాకు వాంతులొచ్చి కక్కుని తిరిగివెళ్ళాను.

'మొదటి రోజులాగే రెండవ రోజుకూడా గడిచింది. వారిద్దరూవుండే చోట్ల యిటూ ఆటూ తిరిగాను. వారిద్దరిమధ్యా నే నూగులాడాను. ఇవాళ ప్రొద్దుటికి నేనొక నిశ్చయానికి రాగలిగాను. ఆమె అనుమానం పూర్తిచేయదలచాను. కనీసము ఒకసారి మాట్లాడుదా మనుకొన్నాను. అయితే మీరిదివరకే తెలుసుకొన్నారుగా—అప్పటికే చాలా ఆలస్యమైంది. ఇక ఆవిషయ

ములో చేయదగిం దేమీ లేదు. ఆమెకు మీరు నయంచేయలేరు. ఆమెబాధ మీరు తీర్చలేరు—అది ఆమె తీర్చుకొంది. ఇక నా విషయానికొస్తే నాకొక సమస్య మిగిలింది. ఆ సమస్యనుగూర్చి ఆలోచన. తిండీ, నిదురా వుండని నా కాలము గడపటానికి మార్గము. చావు కెవరు బాధ్యులు. అదంతా నాదా ? ఇద్దరిదీ నా లేక ముగ్గురిదా. పూర్తిగా ఆమె నిర్దోషని చెప్పటానికికూడా వీలులేదు. పాపం! అసలు హంతకు డెవరు ? దీనికి జవాబు చెప్పగలవా ? మానవప్రకృతి నీకు తెలుసుగదా, మానవసేవ చేస్తావుగా! చెప్పచూద్దాం ?'

రోగి లేచాడు.

'సరే యిక నేనుపోవాలి. నేను చాలా సేపు మాట్లాడాను. నీవు వోపికతో విన్నావు. నాబాధనుగూర్చి నీకొక అభిప్రాయము యివ్వాలనే నేను నీకంత సేపు చెప్పాను. ఏమో. డాక్టర్లకు మరచిపోయిన విషయాలు గుర్తుకి తెచ్చుకోటానికైనా తీరికుండదు. మళ్ళీ ఒకసారి అడుగుతున్నా—నాకు నయంచేయగలరా, డాక్టరుగారూ?'

నిశ్శబ్దంగా రోగి డాక్టరువైపుకి రెండడుగులు వేశాడు. కళ్ళనీళ్ళతో ఒక క్షణం అతనివంకచూసి యిలా అన్నాడు.

'డాక్టరుగారూ నేను మీకొకటి చెప్పొచ్చా? మీరుచాలా అసహాయ స్థితిలో వున్నట్లు కనిపిస్తున్నారు. అయితే యివ్వాళ నేను అటూయిటూ తిరగలేదు. మెట్లదాకా వచ్చి తిరిగిపోలేదు. ఇవ్వాళ నాకు ధైర్యమొచ్చింది. మీ కండ్లవంక తేరిపార చూడగలిగాను. మీరు గొప్పవారు, చాలా గొప్పవారు.

ఒకరోగి గదిలోనుంచి వెళ్ళిపోయాడు. మరోరోగి కుర్చీలో కూలబడ్డాడు.

# ముద్దు

మీకు ఒక చిన్న కథ చెప్తాను వినండి. ఒకనాడు సాయంకాలము ఒక అమ్మాయి, ఒకస్టూడెంటు కలిసి షికారుకి బయలుదేరారు. వూరు బయట ఒక చిన్ననది పారుతోంది. వాళ్ళిద్దరూ నదిఒడ్డు కెళ్ళి ఒక బండమీద, కాళ్ళు నీటిలోపెట్టి కూర్చున్నారు. అలలొచ్చి కాళ్ళకు కొట్టుకుంటున్నై. వాళ్ళిద్దరూ అలాగే చాలాసేపు కూర్చున్నారు. ఒకరొకరు మాట్లాడించుకోలేదు. తమలో తాము ఏదో ఆలోచించుకుంటూ, సూర్యుడివంక చూస్తూ కూర్చున్నారు.

ఆస్టూడెంటుకి ఆ అమ్మాయిని ముద్దుపెట్టుకోవాలని పించింది. ఆ భావం కలగ్గానే అతడు ఆ అమ్మాయి ముఖంవంక, నోటివంకచూసాడు. అసలు

ఆనోరు, బుగ్గలు అందుకోసమే యేర్పడ్డవని అతడుద్దేశపడ్డాడు. ఆ అమ్మాయి కంటె యింకా అందమైన వాళ్ళని ఆ స్టూడెంటు చూశాడు. ఒక అమ్మాయిని ప్రేమిస్తున్నాడు కూడాను. కాని ఆ అమ్మాయిని (ప్రేమించిన అమ్మాయిని) ముద్దెట్టుకోటము అతనికి యిష్టములేదు. ఆ అమ్మాయిని అలాగే ప్రేమిస్తూ దేవతలాగా పూజించాలనుకున్నాడు.

అతనికిమల్లే పక్కన కూర్చున్న ఆ అమ్మాయికూడా మనస్సులో భావాలు రేకెత్తుతున్నై. అతడు తన్ను ముద్దెట్టుకుంటే బాగుంటుం దనుకొంటుంది. ముద్దెట్టుకోగానే అతడ్ని కోప్పడి తిట్టాలనీ, కొట్టాలనీ, చొక్కాపట్టుకొని చించాలనీ, చెంపలు వాయించాలనీ, యింకాయేంటో చేద్దామని అనుకుంటోంది.

కాని ఆస్టూడెంటు ఆ అమ్మాయికి ఆ అవకాశము యివ్వలేదు. ఆ అమ్మాయికి విసుగుపుట్టింది. చివరకి ఆ అమ్మాయే అతణ్ణి యేదో ఒకవిధంగా మాటల్లోకి దించాలని "పునర్జన్మ ఒప్పుకుంటావా?" అని అడిగింది.

అతడు ముద్దుపెట్టుకోవాలంటే ముందు యేంచెయ్యాలో" ఆ అమ్మాయిని యెలామాట్లాడించాలో తెలియక తికమకలు పడుతున్నాడు. ఆ అమ్మాయే ముందు మాట్లాడించే టప్పటికి అవకాశము దొరికిందనుకున్నాడు. ఆ అమ్మాయి అడిగిందానికి 'అవునని' సమాధానము చెప్పి ముద్దుపెట్టుకోవా లనుకున్నాడు.

కాని అతనికి వెంటనే ఒక సందేహము కలిగింది. దానిమీద అతడు వెనక యేం అభిప్రాయము యిచ్చాడో గుర్తుకు రాలేదు. 'అవునంటే' యేం తంటా వస్తుందోనని ఆలోచనలో పడ్డాడు. చివరకు ఆ ఆలోచనలో ముద్దుపెట్టుకోటము మర్చిపోయాడు. సాగదీసి, సాగదీసి 'నేనుచాలాసార్లు పునర్జన్మ వుందని చెప్పుతూ వచ్చానని' సమాధానము చెప్పాడు.

అతడు చెప్పింది ఆ అమ్మాయికి బాగానచ్చింది. అతని వంక తేరిపార చూచింది. అందంగానే వున్నట్టు కనపడ్డాడు. ముఖము బాగానే వుంది. జుట్టు అందంగానే కనపడ్డది. కళ్ళుమాత్రము గుంటకళ్ళగా కనపడ్డయి. అయినా ఆవిధంగా శల్యపరీక్ష చేయడము బాగోదు......అతడు స్టూడెంటు .........పరీక్షలకోసం నిద్రలేకండా రాత్రింబవళ్ళు చదువుకునేవాడు అని అతడిమీద సానుభూతి చూపింది.

అతడు దొరికిన ఛాన్సు పోగొట్టుకున్నా ననుకున్నాడు. మళ్ళీఛాన్సు దొరుకుతుందో, లేదోనని వెంటనే ముద్దెట్టు కోవాలనుకున్నాడు. కాని ఆ భావము అతడి మనస్సులో కొచ్చేటప్పటికి యెక్కడలేని భయము వేసింది. యింతవరకు అత డెవరినీ ముద్దెట్టుకోలేదు. యిదే మొదటి ప్రయత్నము. యెలాముద్దెట్టుకోవాలో తెలియదు. తీరా ముద్దెట్టుకొంటే యేంప్రమాదం వస్తుందోనని భయ

పడ్డాడు. ఆ అమ్మాయి బాగా కలిగిన కుటుంబములోనిపిల్ల. ఆ అమ్మాయి తండ్రి ఆ టవునుకి మేయరుకూడాను.

ఆ అమ్మాయి అతడు ముద్దెట్టుకోగానే బాగా చెవులు మెలెయ్యాలని అనుకుంటుంది.

అతడు యెంతసేపటికీ ముద్దెట్టుకోలేదు. ఆ అమ్మాయికి తాను బాగా అందముగా లేనేమోనని అనుమానము వేసింది. ముఖం నీటిలో చూచుకోటానికి ముందుకు వంగింది. కాని గాలికి అలలు కొట్టుకోటముచేత ప్రతిబింబము కనపడలేదు.

మళ్ళీ ఆ అమ్మాయి ఆలోచనలో పడ్డది. అతడు ముద్దెట్టుకునేటప్పుడు తాను యెలాంటి స్థితిలో వుంటుందో ఆలోచిస్తుంది. యింతవరకు ఆమెకు జీవితంలో వొకే వొకసారి ముద్దువల్ల కలిగే అనుభవాన్ని తెలుసుకుంది. ఒక టీపార్టీ సందర్భములో ఒక లెఫ్టినెంటు ఆ అమ్మాయిని ముద్దెట్టుకున్నాడు. ఆ సమయములో ఆ లెఫ్టినెంటు బాగా తప్పత్రాగి, సిగరెట్టుకాలుస్తూ వుంటంచేత వాడుముద్దెట్టుకున్నప్పుడు నోటినుంచి దుర్వాసనవచ్చింది. కాని లెఫ్టినెంటు కావటముచేత, ఆ అమ్మాయి చాలా చిన్నవయస్సులోవుండి తండ్రివెంట వెళ్ళటముచేత అతడు ముద్దెట్టుకుంటే తిరస్కరించలేకపోయింది. కాని ఆ అమ్మాయికి అతనంటే అసహ్యం వేసింది. ముద్దెట్టుకున్నతరువాత మళ్ళీ ఆలెఫ్టినెంటు ఆ అమ్మాయితో సరిగ్గా మాట్లాడలేదు. ఆ అమ్మాయంటే ప్రేమ కూడా చూపలేదు.

ఈ విధంగా ఆ యిద్దరూ యెవరి మనస్సుల్లో వారు రేకెత్తుతున్న భావాల్లో మునిగిపోయ్యారు. ప్రొద్దుక్రుంకింది; చీకటి నెమ్మదిగా వ్యాపిస్తున్నది.

చీకటిపడ్డా యింకా ఆ అమ్మాయి తనదగ్గరే కూర్చున్నందుకు అస్టూడెంటుకి ఆశ్చర్యంవేసింది. ఒకవేళ ముద్దెట్టుకున్నా ఆ అమ్మాయి అభ్యంతరము పెట్టదనే ధైర్యము వచ్చింది.

నెమ్మదిగా అతడు తన కుడిచేతిని ఆ అమ్మాయి భుజంమీద వేశాడు.

ఆ అమ్మాయికి ఆశ్చర్యంవేసింది. అదివరదాకా ఆ అమ్మాయి అతడు తనని ముద్దెట్టుకుంటాడని, తాను అతడి చెవులు మెలేసి పారిపోదామని అనుకుంటున్నది. కాని తన భుజంమీద చేయివేస్తాడనీ, భుజంమీద చేయివేస్తే యేమి చెయ్యాలో ఆ అమ్మాయి ఆలోచించలేదు. కనుక యేమిచెయ్యటానికి ఆ అమ్మాయికి తోచలేదు. ఒకవేళ కోప్పడి చెయ్యి తీసిపారేస్తే తరువాత ముద్దెట్టుకోడేమోనని ఆ అమ్మాయికి అనుమానంవేసి యేమిచెయ్యకుండా మెదలకుండా కూర్చుంది.

తరువాత అతడు ఆ అమ్మాయిని ముద్దెట్టుకున్నాడు.

ఆ అమ్మాయికి తను అనుకొన్నదానికంటె వ్యతిరేకంగా జరిగింది. తన వొంటి మీద తనకు స్వాధీనము తప్పింది. అతడు ముద్దెట్టుకోగానే చెవులు మెలెయ్యాలన్న విషయము మర్చిపోయింది. అతడు స్టూడెంటు; పరీక్షల కోసము చదువుకుంటున్నాడనే విషయముతప్ప తక్కిన విషయము ఆ అమ్మాయికి గుర్తులేదు.

ఆ స్టూడెంటుకి ఒక పుస్తకములోమాట గుర్తుకివచ్చింది. ఒక మత ప్రవక్త. స్త్రీ హృదయాన్నిగూర్చి వ్రాస్తూ, 'మానవుడు అనురాగాన్ని కామంగా మారకుండా జాగర్తగా తనని తాను రక్షించుకోవా'లని చెప్పతాడు. అతడు ముద్దులోనే యింతప్రభావముంటే మానవుడు కామంనుంచి రక్షించుకోటము చాలా కష్టము అని తెలుసుకున్నాడు.

చంద్రుడుకూడా పాడిచాడు. యింకా వాళ్ళిద్దరూ అక్కడే కూర్చొని ఒకర్నొకరు ముద్దెట్టుకుంటున్నారు.

'నేను నిన్ను చూచిన మొదట్లోనే నాకు నీమీద ప్రేమ యేర్పడ్డ' దని ఆ అమ్మాయి అతడిచెవులో నెమ్మదిగా చెప్పింది.

'యీ ప్రపంచములో నాకు నీవుతప్ప మరెవ్వరూ లే' రని అతడు సమాధానము చెప్పాడు.

# మూఢనమ్మకం

"మనం చిన్న పిల్లలుగా వుండేటప్పుడు మన యింటిముందుతోటే మనకు ప్రపంచంగా కనబడేది. అందులో మనం అన్ని సుఖాలు, కష్టాలు అనుభవిస్తూ వుండేవాళ్ళం, యేం" అని మాన్సియర్ బర్గెరెట్ అన్నాడు.

"సరే! పూటో గుర్తున్నాడా?" అని జో హెచ్చరించింది.

"అరే! ఎందుకులేదు? నాకుచిన్నప్పటి విషయాల్లో బాగాగుర్తుంది పూటో ఒక్కడే. అతనిముఖం, లక్షణాలు యిప్పటికూడా నాకు కళ్ళకుకట్టినట్టు కనబడుతున్నై. అతనితలకాయ చాల పెద్దది............"

" చిన్న నుదురు" అని జో అందించింది,

తరువాత అన్న, చెల్లెలు యిద్దరూ తమకు తెలియకుండానే పోలీసువర్ణించినట్లు పూటోలక్షణాలు వర్ణించసాగారు.

"అవును చిన్ననుదురు."

"పెద్దకళ్లు."

"పొడుగాటి గడ్డం."

"చెవులు పెద్దవి."

"బేలి ముఖం."

"చేతులు త్రిప్పుతూ నే వుద్దేశాలు వెల్లడిస్తూవుండేవాడు."

"చూట్టానికి చాలా బలహీనంగా కనబడేవాడు."

"కాని నిజంగా చాలా బలంకలవాడుసుమా!"

"వెండిరూపాయి నైనా బొటనేలుతో నొక్కి వంచే సత్తావుంది."

"అతనిబొటనేలు చాలా పెద్దది."

మాన్సియర్ బర్గెరెట్ వున్నట్లుండి "జో! మర్చిపోయాము. జుట్టు భలే తమాషాగా వుండేది. కాదు? అరే! మళ్ళీ మొదటినుంచీ చెప్పాలి."

ఇంతసేపూ దగ్గర కూర్చుని వింటున్న పాలిన్ కి యీసంభాషణ విడ్డూరంగా కనబడింది. ఆమె తన తండ్రిని అత్తయ్యను వాళ్లు యీవచనం అంతా ఎందుకు గుర్తుపెట్టుకున్నారో, ఎందుకువప్ప జెప్పుతున్నారో అడిగింది.

తండ్రి పిల్లకు యిలా సమాధానం చెప్పాడు.

"పాలిన్, యిప్పుడు నువ్వు విన్నదంతా మనకుటుంబంలో జరిగిన ఒకరహాస్య సంఘటన. ఇది నీక్కూడా చెప్పడం ముఖ్యం. లేకపోతే యీచరిత్ర మాతోనే అంత మవుతుంది. మీతాతగారు చిన్న చిన్న విషయాలు లాటే లెక్కచేసే మనిషికాదు. కాని యీ విషయంలో మట్టుకు చాలాశ్రద్ధ తీసుకున్నాడు. పైగా దీనికి "పూటో శరీరశాస్త్రం" అని నామకరణంకూడా చేశాడు. అంతేకాదు, అప్పటి శాస్త్రాల్లో పూటో వర్ణన కంటె మించింది లేదనే వాడు కూడాను."

"మీరు చెప్పేది నాకుఅర్థం కావడంలా" అని పాలిన్ అంది.

"పూటోని నీవు యెరుగవుకాబట్టి నీకు అర్థం కాకపోవచ్చు. అసలు విషయాలు చెపుతా విను. నేను, మీఅత్త మరీ పసిపిల్లలంగా వుండేటప్పుడు తాత, నాయనమ్మవాళ్లు మనయింట్లో పూటోవిషయం తరచుగా చెప్పుకునే వాళ్ళు. మేము నిజంగా పూటోని చూచినట్లే భావించే వాళ్లం."

"అసలు పూటో యెవరు?" అని పాలిన్ అడిగింది.

సమాధానం చెప్పకుండా బర్గెరెట్ పకాలున నవ్వాడు. ఆయనతో పాటు జో కూడ నవ్వింది.

తండ్రి, తండ్రితో పాటు అత్త నవ్వటం వల్ల పాలిన్ కి చిన్నతనం వేసింది. బిక్కముఖంతో ఇద్దరి ముఖాలకేసి చూచింది. "నానా! పూటో యెవరో చెప్పవు?" అని మళ్లీఅడిగింది.'

"అమ్మాయ్! ప్లూటో మొట్టమొదట తోటమాలిగా పనిచేసేవాడు. కాని ఆజీవితం అతనికి సరిపడలేదు. తరువాత అది మానుకుని రోజుకూలి చేసుకుంటూ వుండేవాడు. అందులో కూడా అతడు రాణించలేక పోయాడు........."

మధ్యలో జో అందుకుంది.

"బర్గరెట్! నీకు గుర్తుందా? నాన్న టేబిల్‌మీద సిరాబుడ్డి, కలం, పెన్సిళ్లు కనబడనప్పుడల్లా 'ప్లూటో కాజేసా'డని, అంటూవుండేవాడు."

"ఆc! ప్లూటో గుణాలు కూడా మంచివికావు."

"ఇంతేనా?" అని పాలిన్ అడిగింది.

"కాదు. ఇంకా ప్లూటోవిషయం చాలావుంది. మేము అతన్ని బాగా యెరుగుదుము. కాని......"

"కాని, అతడు అసలు పుట్టనేలేదు. అంతేనా?" అని జో అంది.

బర్గరెట్ ఆమెవంక సీరియస్‌గా చూస్తూ "జో! యేంటి అలా అంటున్నావ్. మధ్యలో అడ్డువచ్చి చెప్పేదానికి విలువలేకుండా చేస్తున్నావ్. ప్లూటో పుట్టలేదని రుజువుచేస్తావా? 'ప్లూటో పుట్టలేదుకాబట్టి ప్లూటో అనేవాడు లేడని' చెప్పేముందు అసలు నీవు జీవి పరిస్థితుల్ని పుట్టుకవిధానాన్ని ఆలోచించాలి. చెల్లీ! ప్లూటో పుట్టాడు కాని అతనిది ఒకరకమైన పుట్టుక."

ఆసంభాషణలో శ్రద్ధ తగ్గుతున్నట్లుగా "మీరు చెప్పేది నాకు అర్థం కావటంలే"దని పాలిన్ అంది.

"పాలిన్! నీవే ఆధారం తెలుసుకుంటావు. అసలుసంగతి చెప్తావిను. ప్లూటో పుట్టుక అతడు బాగా నడివయస్సులో వున్నప్పుడు జరిగింది. అప్పటికి నేను యింకా చిన్నపిల్లవాడినే. మీ అత్త నాకంటే ఒక సంవత్సరంన్నర ఉన్నది. మేము అప్పుడు ఒక చిన్న యింట్లో వుండేవాళ్ళం. కుటుంబ పరిస్థితులు అంతే బాగాలేవు. ఆ రోజుల్లో మా ముత్తవ పోకామె (మీ నానమ్మకు అత్తవరుస అయ్యేది.) దూరంగా వూరికి పది పన్నెండు మైళ్లలో నివసిస్తూవుండేది. ఆమె చుట్టం చూపుగా తరచుగా మా యింటికి రావటం, ప్రతి ఆదివారం మానాన్నని, అమ్మని తీసుకెళ్లి ఆమెయింటి దగ్గర విందుచేయటం జరుగుతూ వచ్చింది. కొన్నాళ్లకి యిలా ప్రతిఆదివారం తప్పనిసరిగా కుటుంబంతోసహా అంతదూరం వెళ్లి విందుచేసి రావటం మా నానకే కష్టం అనిపించింది. కాని మా ముత్తవ వూరుకునేది కాదు. వొక ఆదివారం వెళ్లకపోతే వచ్చే ఆదివారానికి బండి పంపిస్తూవుండేది. మాఅమ్మకు లోపల కష్టంగావున్నా పైకి చెప్పేది కాదు. మాముత్తవ ముందు, ఆమె సంతోషంగానే వున్నట్లు నటించేది."

"స్త్రీ జాతి కష్టాలు అనుభవించటానికే పుట్టింది" అని జో చెప్పింది.

"అరే! వొక్క స్త్రీ జాతేంటి, ప్రతిప్రాణి కష్టాలు అనుభవించటానికే పుట్టింది. ఆసంగతి తరువాత ఆలోచిద్దాం. పాలిన్! విను చివరికి మా నాన గట్టిగా వెళ్లకూడదని నిశ్చయించుకున్నాడు. రానని మా ముత్తవముందే చెప్పాడు. మా అమ్మ అలానిర్మొగమాటంగా చెప్పలేకపోయింది. ఆమెయేదో వంకపెట్టి నెట్టివేద్దామనుకుంటే, వంక చూపించి నెట్టేసే చాకచక్యం లేదు మనిషిలో.

"అలా అనబోకు బర్గరెట్. వంకపెట్టటం అమ్మకు ఇష్టంలేదు. వంకపెట్టాలంటే యేదోవొక కారణం చూపించేదే."

"ఆఁ, నిజమే యేదైనా కారణం కనపడ్డప్పుడు ఇంకోటి చూపించటంకంటె కారణం చెప్పటమే మంచిదనుకునేది. చెల్లీ! నీకు గుర్తుందా. ఒకసారి నీకు కొద్ది జబ్బుచేసింది. అప్పుడు 'శ్లోకివొంట్లో బాగాలేదు. యిప్పుడు రాలే'నని అమ్మ సమాధానం చెప్పి ముత్తవనిపంపించింది."

"ఆఁ"

"నీజబ్బునయమయిన తరువాత ముత్తవమళ్ళీవచ్చి వచ్చే ఆదివారం గట్టిగా రావాలని బలవంతం చేసింది. నాన అమ్మని ఏదోవొంక పెట్టమని చెప్పాడు. అమ్మకు యేమీ తట్టలేదు. చివరికి 'అత్తా' రేపు ఆదివారం తోటలో పని చేయటానికి కూలివాడొస్తాడు. రాటానికి వీల్లేదు. క్షమించాలి" అని సమాధానం చెప్పింది"

"యికవిను పాలిన్, ఈమాటలు చెప్పగానే మాముత్తవకళ్లు యింటిప్రక్కనున్న తోటవైపుకు తిరిగినై. 'కూలివాడొస్తాడా? యెందుకూ? తోటలో పని చేయటానికా?' అని మా ముత్తవ అడిగింది."

"చూట్టానికి తోటచాలా చిన్నదిగా వుంది. చెట్లు అసలేలేవు. గడ్డి బాగా మొలిచివుంది. అసలు అది తోటని చెప్పితే యిదంతా కల్పనని మాముత్తవ అనుకుంటుందేమోనని మాఅమ్మకు భయంవేసింది."

"ఆదివారంనాడే రమ్మనటం యెందుకూ? సోమవారంనాడో, మంగళవారమో లేక యింకోనాడో రమ్మనకూడదూ? ఆదివారంనాడు పనిచేయించటం మంచిదికాదు, తక్కినరోజుల్లో వాడెక్కడైనా పనికి కుదిరాడా?' అని మా ముత్తవ మళ్ళీ అడిగింది."

"జో! నేను చాలాసార్లు చూశాను. సబబుగాలేని కారణాలు కూడా ఒకోసారి చాలా సబబుగా కనబడతై. మన ముత్తవకూడా అమ్మ చెప్పిన కారణం నిజంఅనిపించింది. చివరకు ఆమె వెళ్ళటానికిలేస్తూ 'మీ

తోటలో పనిచేయటానికొచ్చే మనిషిపేరేంటి,' అని అడిగింది. 'పూటో' అని అమ్మనోటికొచ్చినపేరు చెప్పింది."

"అదీ! పూటో పుట్టుకకు మొదలు. అప్పటినుంచీ పూటో ప్రచారంలోకి వచ్చాడు. మాముత్తవ 'పూటో? ఆపేరు విన్నట్లేవుందే? పూటో? ఆఁ పూటో! వాడిని యెక్కడో చూచినట్లు గుర్తు. కాని యెక్కడుంటాడో చెప్పలేను. వాడు కూలిపనిచేస్తాడు. యెవరైనా పనిచేయించుకోవాలంటే వాడికోసం పంపుతారు......ఆఁ! వాడు బజార్లో తిరుగుతూ వుంటాడు; అడుక్కుంటాడు. మంచివాడు కాదు......మీరు జాగ్రత్తగా వుండండి' అని సణుగుతూ వెళ్ళిపోయింది."

"అప్పటినుంచీ పూటోకి కొన్ని గుణాలుకూడా వున్నట్లు స్థిరపడింది."

## II

యీ సంభాషణమధ్య గాబిన్, జీన్ యిద్దరూ లోపలికి వచ్చారు. బర్గెరెట్ వాళ్ళతో అంతవరకు జరిగిన సంభాషణగూర్చి టూకీగా చెప్పాడు.

"మా చిన్నప్పటిసంగతి చెప్పుకుంటున్నాము. మాఅమ్మ ఒకణ్ణి సృష్టించి తోటమాలిగా చేసింది. వాడిపేరు చాలా ప్రసిద్ధిలోక్కూడా వచ్చింది."

"సార్! క్షమించండి. మీకు కష్టంవేయకపోతే మళ్ళీ ఇంకోసారి చెప్తారా?" అని గాబిన్ కళ్ళజోడుతీసి తుడుస్తూ అడిగాడు.

"ఆఁ! తోటమాలి అనేవాడు లేడు. అసలు వాడు పుట్టనుకూడా లేదు. మా అమ్మ వొకనాడు 'తోటమాలికోసం యెదురుచూస్తున్నా'నంది. అప్పటికప్పుడే వాడుపుట్టి పనిచేయటం ప్రారంభించాడు."

"ఆఁ! అసలు వాడు పుట్టకపోతే పనియెట్లాచేసాడు?" అనిగాబిన్ తిరిగి ప్రశ్న వేసాడు.

"వాడిపుట్టుక మన పుట్టుకంటేదికదా," దని బర్గెరెట్ సమాధానం చెప్పాడు.

"సరేలే!......వాడిపుట్టుక వూహాప్రపంచంలో జరిగిందని చెప్పరేం?" అని గాబిన్ వెకిలిగానవ్వాడు.

"అయితే వూహాప్రపంచంలోనిపుట్టుక పుట్టుకకాదనా లేక అలాపుట్టిన వాళ్ళు మానవుల్ని యేంచేయలేరనా మీవుద్దేశం? ఒకసారి పూర్వకాలంలో రాసిన పుస్తకాలు గుర్తుకు తెచ్చుకోండి. మీకే తెలుస్తుంది. వాటిల్లో పాత్రలన్నీ సృష్టించబడ్డవే. యదార్థంగా కనబడేవాటికంటే అవే మనబుర్రల్లో ప్రవేశించి మనల్ని తికమకలు చేయగలుగుతున్నై. అన్నికాలాల్లో, అన్నిదేశా

ల్లోను మానవప్రపంచాన్నంతా క్రిందమీదులు చేయగలిగింది. ప్లూటోలాంటి కల్పితజీవులే. ప్రేమచూపించినా, ద్వేషాన్ని రేకెత్తించినా, భయంపుట్టించినా, ఆశలుకల్పించినా, అంతా వాళ్ళేచేసారు. ఫలాన్నిమంచి, ఫలాన్ని చెడ్డ అని నిర్ణయించి వాటినిబట్టి కట్టుబాట్లు, చట్టాలు నిర్మించిందికూడా వాళ్ళే. కాబట్టి ప్లూటోకూడా అలాంటిజాతిలోనివాడేనని, వాళ్ళలాగే జన్మించాడని చెప్పితే ఆశ్చర్యపడనక్కరలేదు. కాని వున్నతేడా యెక్కడంటే వెనకటి గాథల్లోని దేవుళ్ళంతా కవులచేతా, కళారాధకులచేత సృష్టించబడ్డారు. ప్లూటోని సృష్టించింది సామాన్యమానవులు. వాళ్ళకున్నంతకల్పనాశక్తి వీళ్లకు లేదు. వీళ్ళకున్నంత విచక్షణాశక్తి వాళ్ళకులేదు. కాబట్టి వాళ్ళుసృష్టించినంతపకడ్బందుగా మాయామానుష విగ్రహాల్ని వీళ్ళు సృష్టించలేకపోయారు. అందువల్ల వాళ్ళు పుస్తకాల్లోకెక్కారు. ప్లూటోయెక్కలేకపోయాడు. అంతే భేదం. కాబట్టి గాబిక్! నేనుచెప్పిందాన్ని బట్టి ప్లూటోస్థానం యేంటో గ్రహించావనుకుంటాను.'' అని బర్గెరెట్ ఒక దీర్ఘోపన్యాసం దంచాడు.

''ఆ! తెలిసింది.'' అని గాబిక్ తలవూపాడు.

బర్గెరెట్ మళ్ళా ప్రారంభించాడు.

''ప్లూటో పుట్టాడు. వాడు ఒకప్పుడున్నాడు కూడాను. దీన్ని నేను బలపరుస్తున్నా. గాబిక్! ఆలోచిస్తే నీవే వొప్పుకుంటావు. అస్తిత్వం అంటే పదార్థంఅనే అర్థంరాదు. వస్తువుకీ గుణాలకూ మధ్యవున్న సంబంధాన్ని తెలియబరుస్తుంది.''

''ఔను, నిజమే'' జీన్ అంగీకరిన్నాడు. ''కాని గుణాలు లేకుండా వుంటంఅంటే అస్తిత్వం లేదన్నమాటే. యెప్పుడో బాగా గుర్తులేదు. ఒకడు తనసంగతి చెప్పుకుంటూ 'నేనా ? నేనే' నని చెప్పుకున్నాడు. అలాంటి అర్థంలేని మాటల్లో వాడికి యేమీ గుణాలులేవని, గుణాలకూ వాడికీ సంబంధం లేదు కనుక వాడికి అసలు అస్తిత్వం లేదుకాబట్టి చివరికి వాడే లేడని చెప్పుకున్నాడు''

వాళ్లందరు యిలాయేదో యింకా మాట్లాడుకోబోతున్నారు. గాబిక్‌కి అర్థమయ్యేటట్లులేదు. ప్లూటోసంగతి చెప్పమని గుర్తుచేసాడు.

''ఆఁ మరిచిపోయా'' నని బర్గెరెట్ మళ్ళీ ప్లూటోసంగతి యెత్తుకున్నాడు.

''ప్లూటో 19వ శతాబ్దంమధ్యలో పుట్టాడు. యెప్పుడో ఇంకా వెనకపుట్టినట్లయితే అతడుకూడా గొప్పవాడయ్యేవాడు. లోకంఅంతా ప్లూటోని గూడా పూజించేది. అతడు యిప్పటికాలంవాడుకాబట్టి ప్లూటోకి జరగవలసినంత న్యాయం జరగలేదు.''

"మాముత్తవకి పూటో మీద యెందుకో లేని పోని అనుమానం కలిగింది. వాడు దొంగ అని, తాగుబోతని, అడుక్కునేవాడని ఆమె వుద్దేశం. కాని పూటోని వదలి పెట్టదలచలేదు. ఆమె వొకటి ఆలోచించుకుంది. మాది అప్పటికి చాలా బీదకుటుంబం. పూటోకి యేదో కాస్తో కూస్తో కూలియిచ్చి పని చేయించుకుంటున్నారని అనుకుంది. తనతోట్లో ఆదివారము పనిచేస్తున్న వాడిని తీసేసి పూటోని కూలికి పెట్టుకుందామనుకుంది. మనిషి యెలాంటివాడైనా తక్కువ కూలికి పనిచేస్తాడని ఆమె అభిప్రాయం. మాయింటికివచ్చి మా అమ్మతో "పూటోని పంపించు, దొంగాడైతేయేం పనికిట్టంగా చేస్తాడు. మాయింట్లో కొంత కాలం పనిచేయించుకుంటా" నని చెప్పివెళ్లింది. మా అమ్మ సరేనని వొప్పుకుంది.

"అసలు పూటో అనేవాడు లేడు కాబట్టి మాఅమ్మ పూటోని పంపించలేక పోయింది. మాముత్తవ యింకా వస్తాడని కొంపేసు కూర్చుని చివరికి విసుకు పుట్టి మళ్లీవచ్చింది. మాఅమ్మ 'ఇంకా పూటో రాలేదు. రాగానే పంపిస్తా'నని చెప్పింది. 'ఆఁ! నేనన్నట్టే వీడు దొంగముండాకొడుకు. యెక్కడుంటాడో చెప్పు. వెతికి పట్టుకొస్తాను,' అని మాముత్తవ అడిగింది. పూటో అనేవాడు లేకపోతే పూటో అడ్రెస్ యెలావుంటుంది. 'వాడు యీ మధ్యబొత్తిగా కనబడటంలేదు. వాడు యెక్కడుంటున్నాడో కూడా తెలియ'దని మా అమ్మ చెప్పింది. మా ముత్తవకి అనుమానం వేసింది. తనుతీసికెళ్లితే పూటో లాంటి వాడు మళ్లీ మాకుదొరకడని, అందుకని అమ్మ చెప్పటంలేదని ఆమెఅభిప్రాయం పడ్డది. ఆమె స్వార్థదృష్టి యితర్లని కూడా స్వార్థపరుల్ని చేసింది. అసలు ఆమె ననే దేంటి? చరిత్రంతా యిలాగేవుంటుంది. చరిత్ర చెప్పే విషయాలకు సరియైన రుజువంటూ వుండదు."

"అవును నిజమే!" నని పాలిన్ అంది.

"యేంటి!" అని కూరుపాట్లు పడుతున్న జో అడుగుతుంది.

"చరిత్ర చెప్పేదంతా సర్వఅబద్ధం. పాపా ఒకసారి నీవే చెప్పావు"

"ఇప్పటి వాళ్లు అన్యాయం చేసినా భావియుగంలో వాళ్ళైనా తనకు న్యాయం కల్గిస్తారని మేడమ్ రోలండు అంది. తనతో తిరుగుతూ వుండే వాళ్లు, మంచివాళ్లు కాకపోతే తనంటె తెలియనివాళ్లు, ముందు కాలంలో వచ్చేవాళ్ళు మంచివాళ్ళవుతారనే నమ్మకం యేంటి?"

"దానికీ పూటో చరిత్రకీ సంబంధం యేం" టని మళ్ళీ జో అంది.

"చాలావుంది" యెప్పటికప్పుడు తప్పులు దిద్దుతూవుంటే ప్రపంచంలో కొత్తదాన్ని సృష్టించే అవసరం వుండదు. గతించినదాన్ని భావికాలం సరిగ్గా యెలా నిర్ణయిస్తుంది? ఒకణ్ణిగూర్చి సరియైన అభిప్రాయం కలిగించుకునే

లోపుగా అతడు గతించటం, చివరకు ఆవిషయాన్నే మరిచిపోవటం సహజంగా జరిగేపని—అసలు న్యాయంఅంటే యేంటి? అంతదాకా యెందుకు? మా అమ్మ పూటోని గూర్చి చెప్పిన సంగతి నిజమేనని, వాడు యెక్కడా కనబడకుండా తిరుగుతున్నాడని మాముత్తవ మట్టుకి ముత్తవ నమ్మలా?''

''సరే. అసలువిషయానికి వద్దాం. మాముత్తవ పూటోని వదలిపెట్టదలచుకోలేదు. కనపడ్డవాణ్ణల్లా పూటోసంగతి అడిగింది. ఒకళ్ళో యిద్దరో తప్ప తక్కినవాళ్ళంతా 'పూటో కనపడ్డాడా' అని అడగ్గానే 'యెక్కడో చూచినట్లు జ్ఞాపకం' అని సమాధానం చెప్పారు. 'ఆపేరువిన్నాకాని మనిషిని చూడలేదని' ఒకాయన సమాధానం చెప్పాడు. 'ఆఁ పూటోని యెరక్కేం! బాగా యెరుగుదును. కాని ఫలానాచోటవుంటాడని చెప్పలేను.' అని ఒక గోడ్డుగుమాస్తా చెప్పాడు.''

''ఒకనాడు పొద్దుపొడిచేటప్పటికి మాముత్తవగబగబా మాఇంటికివచ్చింది. వచ్చీరావటంతోనే చదువుకుంటూవున్న మానాయనతో 'ఆఁ పూటో కనపడ్డాడు. ఆ యింటిగోడపక్కనే పోతూ నన్నుచూచాడు. నేను వెంటపడ్డాను. గోడ మలుపుతిరగ్గానే నాకు కనపడకుండా పారిపోయాడు. అనుమానంలేదు. వాడే పూటో. ఏభైయేళ్ళు పైబడ్డయి. సన్నగా, వంగిపోయి నడుస్తున్నాడు-- నేను వాణ్ణి 'పూటో' అని కేకవేసాను. వాడు వెనక్కి తిరిగి నన్నుచూచి మళ్ళీ ముఖంతిప్పుకున్నాడు. అనుమానం వున్నవాళ్ళని పోలీసులు నిజం తెలుసుకోటానికి యిలాగే పిలుస్తారు—నన్నుచూచి పారిపోయ్యాడు. వాణ్ణి నమ్మొద్దు. దొంగ, ఖూనీలు చేస్తాడు' అని యింకా యేవో చాలా చెప్పింది.''

''ఇలా మాముత్తవ చెప్పివెళ్ళిన మూడురోజులకి ఆమె తోట్లో యాపిల్సు యెవరో దొంగలించారు. దొంగలు యెవరో తెలియలేదు. పూటోయే దొంగిలించుంటాడని మాముత్తవకి అనుమానంవేసింది. తోట్లోవుండేవాళ్ళని ఆచోకీ తీస్తే, 'యిదివరకు దొంగలు ముఠాలు ముఠాలుగావచ్చి కోసుకుపోతూ వుండేవాళ్ళు.యీదొంగతనంచేసింది ఒక్కడే'నని, పైగా 'యెవ్వరికీ తెలియకుండా, అడుగులజాడాలేకుండానే యాపిల్సు కోసుకువెళ్ళా'డని చెప్పారు. దీంతో అనుమానం మరీ బలపడింది. పూటో తప్ప యింకొకడు అలాంటి పనిచేయలేడని నిర్ధారణ కొచ్చింది.''

''ఒక మాసపత్రికలో మాముత్తవ తోట్లో దొంగతనంమీద ఒక వ్యాసం కూడా ప్రకటించబడ్డది. అందులో పూటోనిగూర్చి 'తలకాయ పెద్దది, నుదురు చిన్నది, కళ్ళు చిన్నవి, పొడుగాటి గడ్డం......' అంటూ వర్ణించబడ్డది.

ఇంకా ఆ పత్రిక పూటో దొంగతనంచేయటంలో చాలా తెలివితేటలుగల వాడనికూడా చెప్పింది.

ఇకచూడండి, టవున్ అంతా పూటో సంగతే. ఒకనాడు వాడు అరెస్టు అయ్యాడని వార్త వచ్చింది. ఒకవారం తరువాత అరెస్టుఅయింది పూటోకాదని పూటో అనుకుని యెవరినో అరెస్టు చేసారని వార్త వచ్చింది. మాముత్తవ యింటో మరో దొంగతనం జరిగింది. వెండి చంచాలు పోయినై. మాముత్తవకి పూటో దొంగలించాడనే. అప్పటినుంచి సామానంతా పెట్టెల్లో పెట్టి తాళాలు మీద తాళాలువేసి రాత్రుళ్ళు నిద్రకూడా పోకుండా కాపలా కాయటం ప్రారంభించింది.''

## III

రాత్రి పదిగంటలు కావస్తోంది. పాలిన్ ఆవలిస్తూ పడుకోటానికి మంచం వంక చూస్తోంది.

''అసలు విషయంవినాలి. అదివినకపోతే పూటో చరిత్రలో లబ్జువుండదు'' బర్గరెట్ అన్నాడు.

''త్వరగా ముగించండి'' అని పాలిన్ చెప్పింది.

''ఒకనాడు రాత్రి మాముత్తవ వంట మనిషిని యెవడో బలవంతంగా చెరిచాడు. మనిషి ఆచూకీ తెలియలేదు. వంటమనిషిని అడిగితే యెవరో చెప్పలేకపోయింది. తెల్లవారేటప్పటికి యీ వార్త వూరంతా పాకిపోయింది. ప్రతివాడూ ఆమనిషిని పట్టుకోటానికి ప్రయత్నించారు. పోలీసులు, సబ్ యిన స్పెక్టరు, చివరకు సర్కిలుతో సహా వూరంతా గాలించారు. కాని ఆచూకీ దొరకలేదు.''

''మా ముత్తవ యిరుగు పొరుగువాళ్ళ నడిగింది. యెవరూ 'మేంచూడలే దంటే మేంచూడలే' దని సమాధానం చెప్పారు. వంటమనిషిని గుచ్చి గుచ్చి అడిగితే అది యేడ్వటంతప్ప సమాధానంచెప్పలేదు. చివరకు 'ఆఁ,పూటోచేసిన పనే. మానవమాత్రుడికి తెలియకుండా యాపిల్సు, చంచాలు దొంగతనం చేసినవాడు వంటమనిషిని తెలియకుండా చెరిచిపోలేడా' అనే నిశ్చయాని కొచ్చింది.''

''మాముత్తవ వంటమనిషికి నెలలురాటం, ఒకబిడ్డపుట్టటంజరిగింది. వూళ్లో ప్రజలంతా ఆబిడ్డతండ్రి పూటో అని నిర్ణయించారు. అప్పటినుంచీ పూటో సామాన్యుడుకాదని, యిష్టంవచ్చిన ఆడవాళ్ళని చెరిచే శక్తివుందని, మానవ మాత్రులు పూటోని యేమీ చెయ్యలేరని ప్రతీతి యేర్పడింది.''

''వూళ్ళో యింకా ఐదారుగురి స్త్రీలకు తండ్రులులేకుండా పిల్లలుపుట్టారు. వాళ్ళందరికీ తండ్రి పూటోయే అని ప్రజలు నిర్ణయించారు. పెళ్ళికాని ఆడ వాళ్ళు పూటోమాట వింటేసరి గడగడ వణికేవాళ్ళు.''

''తక్కినవాళ్ళతోపాటు మాకుకూడా రోజూ పూటోసంగతి చెప్పుకోటం అలవాటైపోయింది. ఇంట్లో, తోటలో, పుస్తకాల్లో, బజార్లో బెంచీలో కుర్చీలో యెక్కడబడితే అక్కడ పూటో కనిపిస్తూ వుండేవాడు. పూటో ముఖంచూడలేకపోయినా, పూటో యెప్పుడూ మా వెంటవున్నట్లే భావించే వాళ్ళం. పూటో సామాన్యుడుకాడని కనబడని దేవతఅని అభిప్రాయంతో వుండే వాళ్ళం. కాని, కవులకు, ఆర్టిస్టులకు పూటో అడవుల్లోతిరిగే అనాగరికుడుగా కనబడేవాడు.''

''కాని మానాయనకు పూటో మరోవిధంగా కనబడేవాడు. పూటోనిగూర్చి మానవులు చెప్పుకునే గాథలు విని వాళ్ళ తెలివితక్కువకు చాలా విచారిస్తూ వుండేవాడు. కాని వాళ్ళతో బాటు తానుగూడ ఆనందిస్తూనే వుండేవాడు. పూటో సంగతి వస్తే తక్కిన వాళ్ళమాదిరిగా తానుకూడా నిజంగా పూటో వున్నాడని, తానుగూడా చూచినట్లే మాట్లాడేవాడు. ఆమాటలు విని మా అమ్మకు ఆశ్చర్యం వేసింది. యెప్పుడైనా వొంటరిగా మాఅమ్మ మానాయన 'అంతా తెలిసికూడా మీరే పూటోని వర్ణిస్తున్నారే' మని 'అడిగితే యేంచేయ మంటావు. వూరంతా పూటో వున్నాడని నమ్మితే నేను కాదంటే నాకువిలువ యేంవుంటుంది? నేను పెద్దమనిషిగా వుండాలనుకుంటే అందరితో పాటు వూం కొట్టాలి. యదార్థంచెప్పితే పిచ్చివాడిక్రింద జమకట్టుతా'రని జవాబు చెప్పతూ వుండేవాడు.''

''తెలివి తేటలున్నవాళ్ళల్లో వ్యక్తిగత అభిప్రాయాలు వెల్లడించే వాళ్ళు చాలామంది యిలాగే బాధపడతారు. దేవుడు కల్పితం అంటే సంఘం పిచ్చి వాడిక్రింద కట్టి వేస్తుంది. సంఘానికి పనికిరాని దాన్ని తీసివేయమంటే ద్రోహ మనిపిస్తుంది. మంచిఅయినా చెడుఅయినా నలుగురితో పాటు నారాయణ అనేవాడే సంఘంలో రాణిస్తాడు. వాడే పెద్దమనిషి. సంఘం వాణ్ణే గౌర విస్తుంది. మాతండ్రి యీగొంటిమధ్య నలగటం వల్ల లాభంలేదనుకున్నాడు. బహిరంగంగా అందరితో పూటో వున్నాడని వొప్పుకున్నాడు. కాని వూళ్ళో జరిగేవాటికి పూటోయే బాధ్యుడు అనేవిషయంలో జోక్యం కలిపించుకోలేదు. పెద్దమనిషిగా వుండాలనుకునేవాడు. యింతకంటె చేసేదీ లేదు.''

''కాని మాఅమ్మ మట్టుకు పూటో విషయంలో అసలుకారణం తానేనని విచారించింది. షేక్సుపియర్ కాలిబన్‌ని సృష్టించినట్లే మా అమ్మ పూటోని

సృష్టించింది. యిద్దరి సృష్టిలో చాలా తేడావుంది. పూటో కాలిబన్ అంత దుర్మార్గుడుకాదు. షేక్సుపియర్ చేసినంత దోషం మా అమ్మ చేయలేదు. కాని మా అమ్మ తాను ఏదో తమాషాగా అన్న విషయం యింత దూరం వచ్చినందుకు కొంత విచార పడుతూ వుండేది.

"ఒకనాడు మా అమ్మ యిలాగే విచారంతో వుంది. మా యింట్లో కొత్తగా పనిచేయటానికి కుదిరిన పనివాడు వచ్చి 'అమ్మా మీకోసం యెవరో వచ్చి మీతో మాట్లాడా లంటున్నాడని చెప్పాడు.

"ఎలావుంటాడు ?"

"కాలివాడ్లాగా వున్నాడు. బక్కపల్చగా. యెర్రగా వున్నాడు. ముసలి వాడు."

"వాడిపేరు తెలుసుకున్నావా"

"ఆఁ పూటో"

"పూటో అని చెప్పాడా ?"

"ఆఁ పూటో అని చెప్పాడు."

"ఎక్కడున్నాడు ?"

"ఇక్కడే ! వంటయింట్లో ?"

"నీవు చూచావా ?"

"ఆఁ"

"యేంకావా లంటున్నాడు ?"

"ఆదేమీ చెప్పలేదు. మీతో మాట్లాడా లంటున్నాడు."

"వెళ్లి ఎందుకొచ్చాడో కనుక్కో"

"పనివాడు తిరిగి వంట యింట్లోకి వెళ్లేటప్పుడు అక్కడ పూటో లేడు. కాని యీ యిద్దరి సమావేశాన్ని గూర్చి యెవరూ యేమీ చెప్పలేకపోయారు. అప్పటినుంచీ మా అమ్మకి కూడా పూటోని తాను సృష్టించలేదని, పూటో పుట్టే వుంటాడని నమ్మకం యేర్పడ్డది.

# జీవితం.

ఆమె తన నాలుగు సంవత్సరాల పిల్లవాణ్ణి వెంట వేసుకొని రోడ్డు దాటుతూంది. రెండు రోడ్లు కలిసే అక్కడ రెండు ట్రాంబండ్లు ఒకదానికొకటి ఎదురుగా నిడబడి దారికి అంటకం కలిగించాయి. అవి దాటిపోయేవరకూ వుండి పోదామని ఆమె అక్కడే నిలబడింది.

పిల్లవాడు కేరింతలు చప్పట్లు కొడ్తూ తల్లి దగ్గరనుంచి తప్పించుకొని ట్రాం బండ్ల కెదురుగా పోయాడు. బండ్లు రెండు అంతకుముందే కదిలినయి.

తల్లి వెంటనే కేకలు పెట్టి ఏడ్చింది. ఆమె పెడబొబ్బలకు రెండు ట్రాముల్లోని డ్రైవర్లు బెదిరిపోయి ఒక్కసారి టక్కీమని బ్రేక్లు వేశారు. ట్రాములోని జనమంతా ఏమిటో చూద్దామని బైటకు తొంగిచూట్టం మొదలుపెట్టారు.

"అదిగో నీకక్కడ ఒక తల్లివుంది" అంటూ చుట్టు చేరిన స్త్రీలంతా కేకలు పెట్టారు. "ఆమె నిజంగా ఎంతో సిగ్గుపడాలి" అన్నారు వాళ్ళంతా.

ఆమె దడదడమంటున్న గుండెలతో అవగా బాపిరా రెండు ట్రాముల సందుకి పరుగెత్తింది. "కోల్యా, కోల్యా" అంటూ కేకలు పెట్టింది. భయంతో ఆమె శరీరమంతా ముద్దగట్టుకు పోయింది.

"మీ అబ్బాయి ఎట్లా వుంటాడు? వూదారంగు లాగు వేసుకున్నాడు కాదూ. ఎర్రగా అందంగా వుంటాడు?" ఆమె సమాధానం చెప్పలేక, ముఖంపైనించి ప్రవాహంలాగా జారిపోతున్న చెమటని తుడుచుకుంటూ మెడ క్రింద ఒక చెయ్యి వేసి గొంతు చిక్కబట్టుకొని ఔనన్నట్లుగా తల వూపింది. భయోత్పాతంతో కంపించి పోతూ చుట్టూ చూసింది.

"ఆ పిల్లవాడు మీ వాడేనా? అటుచూడు ఒక మిలిటరీవాడు రెక్కబట్టుకొని గుంజి లాక్కుపోయాడు. బహుశ నొప్పికలిగే వుంటుంది........."

"ఎక్కడ? ఎక్కడ?" వాళ్లు చూపించిన దిక్కుగా ఆమె గబగబ పరుగెత్తింది. శరీరమంతా దుమ్ముతో నిండి మాసిన మిలటరీదుస్తులు వేసుకున్న ఒక పొడుగాటి వైమానికుడు కోల్యాను భుజాన వేసుకొని ముద్దు పెట్టుకుంటూ హృదయానికి హత్తుకుంటూ వెళుతూండడం చూసింది. పిల్లవాడు వైమానికుని చెవులు పట్టుకొని లాగుతూ ఆనందం పట్టలేక కేరింతలు కొడుతూ వున్నాడు. నొప్పి తగిలినవాడిలాగా ఏమాత్రం కనుపించడంలా. పైగా ఆ వైమానికుని చంకలో దూరి కేరింతలు కొడుతున్నాడు.

"కామ్రేడ్! కామ్రేడ్! నీకేమన్నా మతి భ్రమించిందా? లేకపోతే ఏం జరిగింది?" వైమానికుని వెంట పరుగెడుతూ తల్లి గోల పెట్టింది. కాని అతను మాత్రం వెనక్కు తిరిగి చూడకుండా వెడుతునే వున్నాడు. అసలు ఆమె మాటలు అతను వినిపించుకున్నట్లే కనుపించలేదు.

"కోల్యా, కోల్యా, నా తండ్రిగదే" అని బుజ్జగిస్తూవున్నాడు అతడు.

"ఇక్కడికి ఎట్లా వచ్చావురా దొంగ వెధవా" అంటూనే వున్నాడు.

"పిల్లవాడు అతనికి ఏమి టేమిటో చెబుతున్నాడు.

"ఎంత గుండె కలవాడివి" అంటూ వైమానికుని చెయ్యిపట్టుకొని అతన్ని

ఆపింది. ఆమెను గుండెలు చిక్కపట్టుకు పోయాయి. హృదయం కంపించి పోతూంది. ఆమె దాదాపు వున్మాదావస్థలోకి వెళ్ళింది.

"నాపిల్లవాణ్ణి ఎక్కడికి తీసుకుపోతున్నావు?" ఆమె పెద్దగా అరిచింది. "ఇది చాలా దుర్మార్గంగావుంది. నా పిల్లవాణ్ణి వదలిపెట్టు. పోలీసుల్ని పిలవ మంటావా ?"

వైమానికుడు ఆమె వంక సంభ్రమాశ్చర్యాలతో చూశాడు.

"ఏం కావాలి నీకు ?" ఆమెను అడిగాడు అతను. చుట్టూ జనంమూగారు.

"నాపిల్లవాణ్ణి యెక్కడకు తీసుకుపోతున్నావు. ఇది కేవలం దుర్మార్గం."

"నీ పిల్లాడు ? వీడు నా కొడుకు." నమ్మకం పుట్టించడానికై వైమానికుడు పిల్లవాడి వైపుకు తిరిగి ఆశ్చర్యంగా చూశాడు.

"కోల్యా, నువ్వు ఎవరి పిల్లవాడివిరా చెప్పు"

"నీ పిల్లవాణ్ణే నాన్నా" పిల్లవాడు సమాధానం చెప్పాడు. ప్రక్కనున్న స్త్రీ వైపుకు చేతులు చాపుతూ "అదిగో అమ్మ" అని కేరింతలు కొట్టాడు.

"ఎవరి తల్లిరా ? మీ అమ్మ ఎక్కడుంది ?"

"మా అసలమ్మ స్మశానంలో వుంది." కోల్యా యింకా యిట్లా చెప్పాడు. "జర్మనులు యిక్కడకు వచ్చినప్పుడు అమ్మని తుపాకీతో కాల్చారు. ఆదృశ్యం చూడకుండా అత్తయ్య నాకళ్ళు మూసింది. నేను తరువాత చూశాను......"

"కోల్యా యికచాలు. అంతవరకు చాలు" తండ్రి నిస్పృహతో పెద్దగా నిట్టూర్చాడు.

"అప్పుడు నువ్వీ పిల్లవాణ్ణి తీసుకున్నావన్నమాట. ఎంతకాలమయింది యిది జరిగి" ఆమెనే తిరిగి అడిగాడు

హృదయంలో కలుగుతున్న పెద్ద బాధను దిగమింగడానికై పెదిమను గట్టిగా కొరుకుతూ, అర్ధనిమీలిత నేత్రాలతో ఆమె నిలబడిపోయింది. మెడ కిందవున్న చెయ్యి వొణికిపోతూంది.

"ఇటు చూడు. విచారపడకు. ధైర్యం చిక్కబట్టుకో. ఇప్పుడేంచేద్దాం... మనమిద్దరం కలసి వ్యవహారం పరిష్కారం చేసుకోవడం మంచిది.........ఎక్కడికి వెళ్ళబోతున్నావు అసలు ?" అన్నాడు, వైమానికుడు.

"ఇంటికి"

"నీ అద్దెయింటి కనుకుంటాను?"

"కాదు సొంతయిల్లే." భయంగా పిల్లవాడివైపుచూసి పోదాము అన్నట్లు తలూపింది. "సరే వెళదాంపద. నేను, నా శరీరం, అంతా నిజంగా ఎట్లా వున్నానో భగవంతునికే తెలుసు......... పైగా యిదొక తీవ్రమైన సమస్య

తగులుకుంది......పరవాలేదులే పద" చుట్టూమూగిన జనం వాళ్ళు పోవటానికి చోటుచేశారు

"అదేం పరవాలేదులే...యిటు యీ దారి...కోల్యా. నీ చేతిరుమాల ఏదిరా? ముక్కు తుడుచుకో...కుడిచేతి వైపుకు పదండి...మీరు మాత్రం చట్టవిరుద్ధమైన పని ఏదీ చెయ్యగూడదు తెలిసిందా?"

అతను సమాధానం చెప్పలేదు. ఆవిడ ఏదోమాత్రం ఘోరమైన తప్పుచేస్తున్న మనిషిని పట్టుకొన్నప్పుడు పెట్టే ముఖం పెట్టి అక్రమైమనపని చేసినట్టుగా చూపుమార్చి అతనివెంట దిగులుగా, భయంగా జారుడు గుండెలతో వెళ్ళింది.

ఇంటికి ఎట్లా వెళ్ళారో వాళ్ళకే తెలియకుండా వెళ్ళారు. వైమానికుడు పిల్లవాణ్ణి చంకదింపాడు.

"సరే, యిక నా విషయం చెబుతాను. నేను మేజర్ బ్రెజ్ నెల్ ను"

" నా పేరు రోగల్ చెక్. మిమ్మల్ని కలుసుకున్నందుకు నాకు చాలా సంతోషముగా వుంది. మనయిద్దరిమధ్యా ఎలాంటి తగాదా రాదని అనుకుంటాను"

"మనిద్దరిమధ్యా ఏ సంబంధమైన తగాదా వుంటుంది?"

ఆశ్చర్యంగా, తీక్ష్ణంగా, అతను ఆమె వంక చూశాడు. ఆమె అతనిలో ఒకవిధమైన అసంతృప్తిని అసహ్యాన్ని కలిగించింది.

ఆమె కొద్దిగా చిన్నదిగానూ, సన్నదిగానూ కనిపించింది. ఆమె ముఖం మాత్రం చూస్తానికి చాలా యింపుగా మరీమరీ చూడబుద్ధి అయ్యేట్టుగా వుంది. కాని ఆశ్చర్యం, విషాదం, అశాంతి ఆమె ముఖంలో గోచరిస్తున్నాయి.

"దయచేసి కూర్చుంటారా. వ్యవహారం మాట్లాడుకుందాం. నాకు ఎక్కువ తీరికలేదు. నేను మళ్ళీ వెళ్ళాలి." అన్నాడతను.

"ముందు ముఖం కడుక్కోవూ. కామ్రేడ్ బ్రెజ్ నెవ్? ఆ తరువాత ఒక కప్పు టీ తాగి అప్పుడు......"ఆమె మాటల్లో అతన్ని అక్కడ కొంతసేపు వుంచాలనీ కోరిక. వుంచి అతని దగ్గరనుంచి ఏదో కోరాలనే వాంఛా, ధ్వనిస్తున్నట్లుగా తోచింది మేజర్ బ్రెజ్ నెవ్ కు.

"కాదు ముందు వ్యవహారం పరిష్కారం చేసుకుందాం."

ఆమె తన జీవితగాధ ప్రారంభించబోయేముందు ఒకసారి పక్కింటికి పోయింది. తరువాత కలిగిన మోతనుబట్టి టీపాత్ర పొయ్యిమీద పెట్టి వచ్చిందని అతను తెలుసుకున్నాడు. "నేను లెనిన్ గ్రాడ్ లో నివసిస్తూ వుండేదాన్ని" డోగల్ చెక్ తనగాధ ప్రారంభించింది.

"గడచిన జనవరి మాసంలో నాభర్త కేవలం నా కళ్ళముందు నేను చూస్తుండగా చంపబడ్డాడు. నేను ఏకాకినైపోయాను. అది జరిగినప్పుడు

మాత్రం నేను జీవిస్తాననుకోలేదు, అంతగా నా గుండెలు కదలి పోయినయి. ఆతరువాత, నేను సుఖంగా చూస్తానికి ఆనందంగా ప్రేమిస్తానికి నాతోపాటు నివసిస్తానికి నాకొక జీవి అవసరమైంది. దిక్కులేని పిల్లవాణ్ణి ఒకణ్ణి పెంచుకుందామని నిశ్చయించుకున్నాను. అట్లాంటివాళ్ళు చాలామంది దొరుకుతారు. కాని నాకు కావలసినవాడు దొరకలేదు. సరిగ్గా నాభర్తపోలికలున్న పిల్లవాం కొరకు వెదికాను. అంతేగాదు ఆపిల్లవాడి పేరుగూడా నాభర్తపెరు అయివుండాలనిగూడా కోరుకున్నాను. నేను కోల్యాను ఎప్పుడైతే చూచానో అప్పుడే అనుకున్నాను. నాకు కావలిసిన వాడు నా వాడు దొరికాడని ఆనందించాను.

"కాని వాడు దిక్కులేనివాడుకాదు" అన్నాడు మేజర్ బ్రెజ్ నెవ్.

"అవును నాన్నా నేను దిక్కులేనివాణ్ణే, అత్తయ్యనుగూడా జర్మనులు చంపిపారేశారు." కోల్యా బుల్లిచేతులు తిప్పుతూ చెప్పాడు.

"దిక్కులేని పిల్లల్ని పోషించే ఆ శరణాలయంలో కోల్యా తల్లి జర్మనులచేత చంపబడ్డదని వీడి తండ్రిగూడా యుద్ధరంగంలో చంపబడ్డాడని, వీడి దగ్గర బంధువులుగూడా చంపబడడమో లేక గాయాలు తగిలి అస్పత్రిలో చేరారనో నాకుచెప్పారు. అప్పుడు నేను వెంటనే జరుపవలసిన తంతు నంతా జరిపి వీణ్ణి తీసుకుపోయాను.

"యుద్ధరంగంలో చంపబడ్డది నేనుకాదు. నాపేరుగల మరొకడు" అన్నాడు మేజర్ బ్రెజ్ నెవ్. రోగల్ చెక్ దేనికొరకో గదంతా ఆతురతగాచూస్తుంది.

"అమ్మా: ఏమిటి దేవులాడుతున్నావు" అడిగాడు పిల్లవాడు.

"నా తోలుసంచి ఎక్కడుందిరా నాన్నా"

"మళ్ళీ మొదలా. ఎందుకనే అమ్మా నీకుఎదటున్న వస్తువులే కనుపించవు. అదేం ఆ కుర్చీ మీద ఏమిటిది?"

మేజర్ బ్రెజ్ నెవ్ బల్లమీద వేళ్ళతో దరువువేస్తూ కొడుకువంక దొంగ చూపులు చూశాడు. ఎవరో ఆ కొత్తావిడ్ని తన కొడుకు అమ్మా అని పిలవడం అతన్ని బాధించింది. కాని కొడుకుని ఏమీ అనలేక మౌనంగాకూచున్నాడు.

రోగల్ చెక్ తన ప్యాస్ పోర్టు తీసి మేజర్ ముందు పెట్టింది.

"యుద్ధంలో చనిపోయిన రెడ్ ఆర్మీ సేనాని కొడుకుని పెంచుకుంటానికి నాకు సర్వాధికారాలున్నాయి అని నాకు నమ్మకంచిక్కింది. నావిద్య శిక్షణ నా ఆదాయంఅన్నీగూడా పిల్లవాడి పోషణకు సరిపోతయ్యనే నా ఘట్టినమ్మకం ...... నేనుగూడా యుద్ధంలో చనిపోయిన ఒక రెడ్ ఆర్మీ సేనాని భార్యనే."

ఆమె స్వరం కొంచెం హీనంగా వొస్తుందిగాని వింటానికి ఎంతో సుఖంగా వుంది. ఆ గొంతుకను వింటూ బ్రెజ్ నెవ్ తన భార్యను గుర్తుకు తెచ్చుకున్నాడు

........తన భార్యకు ఎంతో సమయస్ఫూర్తి వుంది. ఆమె కూడా యీమె మాదిరిగా వొక్క పిరులాగానే వుండేది. అయినా యీమె కంటె బలంగానే వుండేది. ఆమెలో తన సౌఖ్యాన్ని తన ఆశల్ని తన జీవిత సర్వస్వాన్ని దాచుకొని బ్రతికాడు మేజర్ బ్రెజ్ నెవ్. ఇక ఆమె తిరిగిరాదు. ఆమె చచ్చిందని వినగానే తనలో ఏదోకొంత నశించినట్లుగా, ఆమె మరణంతో తన భవిష్యత్తులో కొంతపడిపోయినట్లుగా అనిపించింది బ్రెజ్ నెవ్‌కు.

పక్కింటావిడ ట్రేలో రెండు టీకప్పులు, సాసర్లు, పంచదార కప్పు పెట్టుకొని తీసుకు వచ్చింది. బ్రెజ్ నెవ్ సరాసరిగా ఒక టీ కప్పు తీసుకొని గబగబా రెండుగరిటెలు పంచదార వేసుకొని వెంటనే తను చేస్తున్న తప్పు తెలుసుకొని నాలిక కొరుక్కున్నాడు.

"నాన్నా, నాన్నా, ఏమిటి నువ్వు చేస్తుంది. పైగా అంత పెద్దవాడివి" చప్పట్లు కొడుతూ తన తండ్రి తప్పుపని చేస్తూ పట్టుకున్నందుకు ఎంతో సంతోషించాడు కోల్యా.

"అమ్మ యివ్వనన్నా నాన్నా ఎందుకు నీకంత తొందర?"

వాళ్ళ నాన్న సిగ్గుపడుతూ ముసిముసి నవ్వులు నవ్వాడు.

"నిజమేరా అబ్బాయి. చాలా తప్పుపని చేశాను. ఇకెప్పుడు చెయ్యను. కాస్త పంచదార వేసుకో నువ్వుకూడా"

"చూడండి మీరు నేను చెప్పేమాటలు వింటున్నట్లులేదు." గోగల్ చక్ గొంతుక వుద్రేకంతో వొణికిపోతుంది. చెబుతున్నా వినండి. కోల్యా మీకు ఎంతగా కొడుకో నాకూ అంతగా కొడుకే అవుతాడు. చట్టంప్రకారం వాడు నాకుబిడ్డ. వాణ్ణి నేను పెంపుడుకు తెచ్చుకున్నాను.

"వాణ్ణి పెంచుకున్నాననడంలో మీవుద్దేశ్యం? అయితే నేను ఘట్టిగా..."

"వాడు నికోలే బ్రెజ్ నెవ్ అనుకోండి. అయితే మాత్రం వాడు నా కొడుకుగా రిజిస్టర్ చెయ్యబడ్డాడు."

మేజర్ బ్రెజ్ నెవ్ లేచి గదిలో అటుయిటు తిరగటం ప్రారంభించాడు.

"ఇదొక చండాలపు సమస్యగానే తయారయిందే. అయితే ఏం చేద్దాం యిపుడు? ఏదైనా యిప్పటికిప్పుడే మాత్రం తేల్చాలి. ముఖ్యంగా మీరు నాపిల్లవాణ్ణి జాగ్రత్తగా పెంచి అంత ప్రేమతో కాపాడుతున్నందులకు నా హృదయపూర్వక వందనా లర్పిస్తున్నాను. మీరు ఆ విధంగా వాణ్ణి ప్రేమిస్తున్నందుకు వాణ్ణి మీ వాడుగా చేసుకోవాలని మీరుచేస్తున్న పోరాటానికి నేను నిజంగా ఎంత కృతజ్ఞుణ్ణో మాటల్లో చెప్పలేక పోతున్నాను. దిక్కు దివాణంలేకుండా వాడిప్పుడున్నట్లయితే వాణ్ణి ఏం చెయ్యగలిగేవాణ్ణో నాకే తోచకుండా వుంది.

ఆట్లాంటి దురవస్థనుంచి మీరు తప్పించారు. సరే నేనుయుద్ధంనుంచి తిరిగివచ్చిన తరువాత ఏం చేద్దాం.'' అన్నాడు బ్రెజ్ నెవ్.

''— ని సంగతి యిప్పుడెందుకు? ఆసమయం వచ్చినప్పుడు దాని సంగతి చూద్దాం'' గోగల్ చెక్ ఘట్టిగా అన్నది. మేజర్‌కు తన కొడుకుమీద ఎక్కడి లేని ప్రేమాకలిగింది. అతనుంలో తన భవితవ్యాన్ని గురించి పెద్దవాళ్ళిద్దరూ పోట్లాడుకుంటారేమో, లేక ఏవిధంగా నిర్ణయిస్తారో నని పిల్లవాడు బాధగా చూస్తున్నాడు.

''మీఆదాయం ఎంత? ఇద్దరికీ సరిపోతుందా?'' నిట్టూర్చుతూ అడిగాడు.

''సరిపోదని చెప్పలేను'' గోగల్ చెక్ స్థిమితపడింది, ఆమె ముఖం వికసించింది.

''మరిబట్టల సంగతి ఏమిటి? ఈగోజుల్లో గుడ్డలు మండిపోతున్నాయి కొందామంటే''

''వాడికొక్కవలసినవరకు బట్టలున్నాయి, భోగాలకు యిది సమయం కాదు గదా: వాడైనా అల్లరి పిల్లాడుకాడు. చాలానిదానం.''

''సరే, నా జీతంలోనించి నేను మీకు కొంత పంపిస్తుంటాను. పెనిసిల్ వుందా మీదగ్గర. ఉంటే నాఅడ్రసు రాసుకోండి చెబుతాను.'' గోగల్ చెక్ అడ్రసు వ్రాసుకుంది.

''సరే యిప్పుడు మీరిక ముఖంకడుక్కుంటా రనుకుంటాను. అదుగో అక్కడున్నాయి నీళ్లు'' అడిగింది ఆమె.

''నేను చాలా కృతజ్ఞుణ్ణి. మీకాలాన్ని నేనేమీవ్యర్థం చెయ్యడంలేదుగదా''

''అబ్బె కానే కాదు. ఇవ్వాళ నాకు శలవు దినం.''

''అమ్మ నన్ను యివ్వాళ్ళ సినిమాకు తీసుకుపోతా నన్నది. నాన్నా నువ్వు గూడా వస్తావా?'' కోల్యా అడిగాడు.

''లేదు నాన్నా. నేను రావటానికి వీలులేదు. మీ వెంట సినిమాహాలు దాకా వస్తా. తరవాత నేను వెళ్ళాలి.''

గోగల్ చెక్ బైటకు వెళ్ళింది, మేజర్ ముఖం కడుక్కొని వచ్చి గోగల్ చెక్ ప్యాసుపోర్టు పరీక్షించడం మొదలుపెట్టాడు. ఆమె గదిలోకి వచ్చింది.

''అయితే మీరు జినైదా యాంటొనోవ్నా అన్నమాట.'' అతనికి మాటలు కొంచం తడబడ్డాయి. ''నా పేరు వాసిలి వాసిల్ యెవిచ్, నా వయస్సు 36 సంవత్సరాలు. మనిద్దరం పరిచయస్తులం అవటం అవసర మనుకుంటాను. ఏమంటారు?''

''నేను అదే అనుకొంటున్నాను.'' ఆమె నవ్వుతూ చెప్పింది.

"సరే నాకు టైము లేదు వెళ్ళాలి." అన్నాడు బ్రెజ్ నెవ్.

వాళ్లు పిల్లవాణ్ని చెరొక చెయ్యిపట్టుకొని బైటకు వెళ్ళారు. కోల్యా యిద్దరి మధ్యా ఎంతో ఆనందంతో పట్టలేని గర్వంతో గంతులేస్తూ నడిచాడు. ట్రాం బండి ఆగే ప్రదేశానికి వచ్చింతరువాత మేజర్ బ్రెజ్ నెవ్ కొడుకుని యెత్తుకొని మొఖంమీద గొంతుదగ్గర చేతులమీద ముద్దులవర్షం కురిపించాడు.

"మా నాన్నకదూ. జినైడా యాంటోనోవ్నాను బాగా ప్రేమించు. ఆమె చెప్పిన పనల్లా చెయ్యి. తెలిసిందా?" అన్నాడు మేజర్.

"నాన్నా ఎవరి మాటన్నావ్" అడిగాడు పిల్లవాడు.

"ఎవరా......అమ్మ......ఆమె......"

"నేను అమ్మనుచాలా ఎక్కువగా ప్రేమిస్తాను. నాన్నా మరి నువ్వో."

జినైడా యాంటోనోవ్నా మొఖం తెల్లబడింది. ఆమె శరీర మంతా పులకరించింది.

"కోల్యా నా కాబే. నాన్నతో చెప్పు తండ్రీ నీకు వుత్తరాలురాస్తుండ మని" అన్నది నెమ్మదిగా.

"నాన్నా మాకు వుత్తరాలు రాస్తూవుంటావుకదూ ?"

"తప్పకుండానమ్మా. మళ్ళీ తిరిగి రాస్తూవుంటావా? నువ్వు చెప్పినమాట వినే బుద్ధిమంతుడవు అని మాత్రం అనిపించుకోవాలి. తెలిసిందా?"

"అమ్మ నీకు రాస్తూవుంటుందిలే. ఆ వుత్తరాల్లో చివర నేనుగూడా కాస్త రాస్తూవుంటాను."

"నువ్వు చాలా మంచివాడివిగా. సరే టైము అయింది. మీకు నాకృతజ్ఞత ...వ్యవహారాలు తరవాత పరిష్కారం చేసుకుందాం. జినైడా యాంటోనోవ్నా మీకు నా నమస్కారాలు." అదే ప్రథమపర్యాయంగా అతను ఆ అమ్మాయి కళ్ళల్లోకి నూటిగా చూశాడు.

"అయితే నాన్నా అమ్మను ముద్దుపెట్టు కోవూ ? నన్ను పెట్టుకున్నావు గాని అమ్మను ముద్దుపెట్టు కోలేదు. ఏందుకని ?"

బ్రెజ్ నెవ్ తన చేతిని ఆమె భుజాలమీదుగా మెడవెనకకు పోనిచ్చి దగ్గరకు తీసుకొని సున్నితంగా ఆమె నుదుటిని ముద్దు పెట్టుకున్నాడు.

"నా ప్రియతమా నీకు నా కృతజ్ఞత. నా హృదయపూర్వక ధన్యవాదాలు"

ట్రాంబండిమీదకు అతను ఎగిరి దూకాడు. లోపల చాలా ఖాళీ వున్నా బైట చెక్కమీద నిలబడి వెనక్కు తిరిగి ఆ బక్కపలచటి ఆ అమ్మాయివంక, ఆ పిల్లవాడివంక కనుపించేంతవరకూ చూస్తూ నిలబడిపోయాడు.

---

# సావిత్రమ్మగారి సంధ్యారాగం

(కథల సంపుటి) వెల రు 1—0—0

రచయిత : బుద్ధవరపు నాగరాజు, బి. ఏ., బి. ఇడి.

మానవ మనః ప్రవృత్తులలో విచిత్ర గతులను అతి సహజంగా చిత్రించే నేర్పు యీ కథకుడి కథల్లోనే చూడాలి.

# ప్రపంచ నాటికలు

(భాగం 1) వెల రు 1—0—0

పి. వి. సుబ్బారావు

కె. రాధాకృష్ణమూర్తి

నాటికా సాంప్రదాయము, రచనాశిల్పము తెలిసిన విశ్వసాహితీపరుల ఏకాంక నాటికలు.

# ఇండియాలో విప్లవం

(Enlarged Second Edition) వెల రు 1—0—0

రచయిత : కె. రాధాకృష్ణమూర్తి, బి. ఏ.

యీ యుద్ధ ఫలితంగా ఇండియాలో జరిగే మార్పులు, వాటిని వుపయోగించుకునే విధానం యీ పుస్తకం ద్వారా తెలుసుకోండి.

# ఆదర్శశిఖరాలు

(నాటికలు) వెల రు 1—0—0

రచయిత : జి. వి. కృష్ణరావు

ఆల్ యిండియా రేడియో వారిచేత బ్రాడ్ కాస్టుచేయబడి అనేక నాటకసంస్థలవారిచేత ప్రదర్శింపబడి శ్రోతలప్రేక్షకుల మన్ననలకు పాత్రమయిన ఏకాంక నాటికలు. నాటకం రచనకు పూనుకునే ప్రతిరచయిత యివి తప్పక చదవాలి.

## ఇండియా భవిష్యత్తు

వెల రు 1—0—0

రచయిత: కె. రాధాకృష్ణమూర్తి, బి. ఏ.

యుద్ధానంతర భారతదేశ సమస్యలనుగూర్చి చక్కని వుపన్యాసం.

## గతిలేనివాళ్లు

(కథల సంపుటి) వెల రు 1—0—0

రచయిత : పి. వి. సుబ్బారావు, బి. ఏ.

జీవితసంఘర్షల్లో విధి విడంబనద్వారా పరాజితులైన భగ్నజీవుల విషాదగాథలు.

## ప్రపంచ కథలు

(భాగం 2) వెల రు 1—0—0

కె. రాధాకృష్ణమూర్తి

పి. వి. సుబ్బారావు

వివిధదేశాల ప్రముఖ రచయితల కథలకు స్వేచ్ఛానువాదం.

## పరివర్తనం

(నవల) వెల రు 1—0—0

రచయిత ; గోపీచంద్

ఆదర్శప్రపంచంనుంచి వాస్తవికజగత్తుకు మరలిన ఒకానొక విషాదజీవి సంఘటన. అత్యద్భుత మనస్తత్వనిరూపణ.

## జఘనసుందరి

(నవల) వెల రు 1—0—0

రచయిత ; జి. వి. కృష్ణరావు

మనోదేహము లొకదానిపై నొకటి చూపు ప్రభావం నవలారూపంలో ప్రతిభావంతంగా చిత్రింపబడ్డది.